బొల్లిముంత శివరామకృష్ణ

# అంతరాత్మ అంత్యక్రియలు

కథానికా సంపుటి

నవయుగ పబ్లిషింగ్ హౌస్
గుంటూరు.

# పరిచయం.

ఒక వస్తువు ప్రతిబింబాన్ని చూడాలంటే, ఆ వస్తువు ఎంతవున్నదో అంతే పరిమాణంగల అద్దాన్ని దాని ఎదుట వుంచనక్కరలేదు. అద్దం చిన్నదైనా, ఎదుటవున్న దృశ్యాన్ని అది ప్రతిబింబిస్తుంది. ఇంచుమించు చిన్నకథ కూడా యింతే. అయితే అద్దంలో వస్తువును ఎవరైనా ప్రతిబింబింపచేస్తారు; సాహిత్యంలోమటుకు వస్తురూప భ్రాంతిని కలగచేయడం అందరికీ సాధ్యంకాదు. అభిప్రాయ ప్రకటనకు అనేక సాధనాలువున్నా కళలలో దానిని మలచడం మరీకష్టం. రూపచిత్రణ, బొమ్మకట్టే నేర్పులేనిదే కళలలో యిది పొసగదు. రూపచిత్రణ ప్రత్యక్ష జీవితంనుంచి పరిగ్రహించడం సులువైన పనికాదు. అభిప్రాయ ప్రకటనకంటె, అనుభూతిని అందివ్వడంలోనే గొప్పతనం గర్భితమైవుంటుంది.

ఆధునిక ఆంధ్రసాహిత్య యుగపురుషుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ అభిప్రాయ ప్రకటనకు వచనరచనాప్రభేదాలయిన వ్యాస, ప్రహసన, విమర్శనాదులను చేపట్టినా, కారణం తెలియదు కాని, చిన్నకథను వారు ఎత్తుబడిచేయలేదు. కాగా కథానికా సాహిత్యానికి సైతం గురజాడ ఆద్యులు కాగలిగారు. నాటినుండి నేటివరకు ఆంధ్రసాహిత్యంలో చిన్నకథ దిన దిన ప్రవర్థమానమాతూ వస్తున్నది. నవ్యాంధ్ర సాహిత్యం వస్తురీతులలో వైవిధ్యం కలది. ప్రాచీన సారస్వతంలో లేని వివిధ కవితా రూపాలను పాశ్చాత్యదేశాలనుంచి మనం ఎరువు తెచ్చుకుని స్వంతరించుకున్నాము. మన ఉద్యానవనంలో లేని పూలమొక్కలను మనం అంట్లు కట్టుకుని పెంచుకోవడంలో దోషంలేదు. ఆధునిక ఆంధ్రసారస్వతంలో ఖండకావ్యం, నవల, ఏకాంకిక, నాటకం, చిన్నకథ రచయితల చేతి చలవవల్ల చక్కగా పెరిగి పెద్దవవుతున్నవి. వీటిలో ప్రధానంగా పేర్కొనదగింది చిన్నకథ. ఖండకావ్యం కూడా తెలుగులో చెప్పుకో తగినంతగా పరిణతి చెందినప్పటికీ, యిటీవల దీని వికాసం కుంటుపడిందని చెప్పవచ్చును. కాగా చిన్నకథల ప్రాధాన్యత హెచ్చింది. చలం, కొడవటిగంటి, గోపీచంద్, పద్మరాజు, బుచ్చిబాబు, సోమయాజులు, ఈరా మొద

లైన ప్రముఖ కథకుల తరువాత సైతం, నేడు కథానికా రచనను సాగిస్తున్న యువరచయితలలో ప్రసిద్ధులు వున్నారు. మన కిప్పుడు కథారచయిత లనేకులు. వెలువడుతున్న కథ లనేకం. కథలులేనిదే పత్రికలకు సైతం నిండుతనం లేనట్టే తోస్తున్నది. గురజాడనుంచి నేటివరకూ వెలువడిన కథానికలలో ఉత్తమమైన వాటిని ఎంచుకుని, వొక కథానికా సంపుటిని ప్రచురిస్తే అనేక అంతరువుల తెలుగు జీవితాన్ని ఆ సంపుటి ప్రతిబింబిస్తుంది.

ఈనాడు తెలుగుదేశపు పల్లెల, పట్టణాల జన జీవితాన్ని సాహిత్యం ద్వారా తెలుసుకోదలచిన పాఠకులకు, చిన్నకథలు చక్కగా ఉపకరించ గలవు. వివిధ జిల్లాల మాండలిక పదాలసొంపూ, నుడికారపు సౌరూ, ప్రజల అభిరుచులూ, అలవాట్లూ, ఆవేశాలూ, ఆవేదనలూ చిన్నకథలలో అతి సుందరంగా పరిపోషితమైనవని చెప్పడంలో విప్రతిపత్తిలేదనే అనుకుంటాను.

కొంతకాలం, నాయికా నాయకుల మధ్య ప్రేమను, విప్రలంభ శృంగారాన్ని మాత్రమే యితివృత్తంగా తీసుకొని సాగిపోయిన కథానికా రచన, అదృష్టవశాత్తూ గురజాడ ఆశించిన మార్గానికి మళ్ళింది. ఖండకావ్యం పట్ల కూడా, మనం, యిదేమాటను అనువర్తింపచేసుకోవచ్చును. తెలుగు దేశ సాంఘిక జీవిత చిత్రీకరణకు పూనుకున్న చిన్న కథ, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలోను, యుద్ధానంతరం యింకొక పరిణామాన్ని చెందుతూ వస్తున్నది. కళలకు సాంఘిక ప్రయోజనముందనే సిద్ధాంతం విస్తృతమై తెలుగునాట తలఎత్తిన రాజకీయ జీవితాన్ని సైతం చిత్రీకరింప జొచ్చింది. ఈ పరిణామాలకు అభ్యుదయరచనోద్యమం ఎంతో ప్రోద్బలమిచ్చింది; తత్ఫలితంగా ఎన్నో ఖండకావ్యాలు, నాటికలు, నాటకాలు, చిన్నకథలు వెలువడినాయి.

౨

ఒక సాంఘిక ప్రయోజనాన్నో, లేదా రాజకీయ ప్రయోజనాన్నో ఉపలక్షించి రచన సాగించడం మాటలతో పనికాదు. పేరుపడ్డ రచయితలే యిక్కడ విఫలులయ్యే ప్రమాదం లేకపోలేదు. రచయిత ఏమాత్రం అజాగ్రత్త వహించినా శిల్పం దెబ్బతిని, రచన కేవలం నినాదాలప్రోగుమాదిరి మారిపోయే

చిక్కు ఏర్పడుతుంది. కళకుగల ప్రాథమిక సూత్రాలను దృష్టిలో వుంచుకుని తగిన సన్నివేశాలను, వాతావరణాన్ని సృష్టించి పాత్రలకు రూపు దిద్దవలసి వుంటుంది. ఆ పాత్రకు సహజంగా స్వభావంలో లేని ఉద్దేశాలను ఆరోపించినట్లయితే అది కేవలం నినాదమే అవుతుంది. ఒక ఉద్దేశాన్ని ప్రకటించే ఒకపాత్రకు ఆ అభిప్రాయాన్ని వ్యక్తంచేసే స్వభావం వున్నదా, లేదా, యిది సహజమా, కాదా అనేప్రశ్న ఉదయిస్తుంది. వ్యక్తుల సామూహిక జీవితవర్ణనా, సామాజిక వాతావరణమూ, రాజకీయోద్యమాల సంఘర్షణా, పోరాటాలూ సాహిత్యంలో చక్కగా చిత్రించే రచయిత గొప్ప కళావేత్త అయివుండాలి. నవచైనా సాహిత్యంలోసైతం గొప్ప రచనలు వెలువడుతున్నా, సిద్ధహస్తులైన రచయితలే పాత్రల ప్రత్యేక వ్యక్తిగత మనస్తత్వాలను, వాస్తవిక జీవితాన్ని రసమయంగా చిత్రించలేక, తబ్బిబ్బు పడుతున్నారని, యీ ప్రమాదంనుంచి యువ రచయితలు తప్పించుకోవాలని చౌఎంగ్ హెచ్చరిస్తున్నాడు.

నిజంగా చెప్పాలంటే మన యువరచయితల సాహిత్య సృష్టిలో రసమయ వాస్తవిక రచనల కంటె నినాదపూరిత రచనల సంఖ్య బహుళం. ఈమజిలీని మనం దాటి, జీవితాన్ని పరిపూర్ణంగా అర్థంచేసుకుని సాంఘిక ఉద్ధతికోసం, పురోగతికోసం అన్నివిధాలా బంధింపబడ్డ మానవస్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం బహుముఖ ప్రజ్ఞతో, వాస్తవిక రచనలను సృష్టించాలి.

## 3

చక్కని ఖండకావ్యాలను, నాటికా నాటకాలను, కథలను రచించే యువకులు తెలుగు సారస్వత రంగంలో అడుగుపెట్టారు. తెలుగుపాఠకులు వీరినుంచి ఎంతో ఆశిస్తున్నారు. యువ రచయితలలో సిద్ధహస్తు లనేకులున్నారు. ముమ్ముందింకా ఉదయించగలరనే ఆశవుంది.

మిత్రులు శ్రీ బొల్లిముంత శివరామకృష్ణగారు అభ్యుదయ రచయిత; విశేషించి రాజకీయోద్యమాలతో నిత్యసంబంధంకలవారు. ప్రజాఉద్యమాలలో పాల్గొనడమే కాకుండా వాటికి అగ్రగాములుగా వుంటూ సారథ్యం వహిస్తున్నవారు.

మిత్రులు శివరామకృష్ణ తమ రచనలను రెండు సంపుటాలుగా వెలువ రిస్తున్నారనే కబురువిని సంతోషించినవారిలో నేను మొదటివాడిని. వివిధ వృత్తులలో పాల్గొంటున్నవారు, సాహిత్యసృష్టిచేయడం మనకు అరుదు. తెలుగు దేశంలో డాక్టరు డాక్టరే; ప్లీడరు ప్లీడరే; వారి జీవితంలోగల ముచ్చట్లనూ, వృత్తివిశేషాలనూ వారు సాహిత్యంలో ప్రతిబింబింపచేయడంలేదు. వివిధ జీవిత రంగాలలో పాల్గొంటున్నవారు, ఆ యా జీవితాలను సారస్వతంలో స్వప్నాలుగా చిత్రిస్తే తెలుగు జీవిత వైవిధ్యం సాహిత్యంలో యింతకంటె చక్కగా ప్రతిబింబించి వుండేది. ఒకరోగికి శస్త్రచికిత్సచేసిన ఒక డాక్టరు చక్కటి రచయిత అయితే, ఆ శస్త్రచికిత్సా పద్ధతి, మామూలు రచయిత వ్రాసిన రచనకంటె ఆ డాక్టరు రచనలో చక్కగా వ్యక్తమయేందుకు అవకాశం వుంది. కనుకనే జీవితంలో అనేక వృత్తులలో పాల్గొంటున్నవారు, సాహిత్య రచనవైపు తమ దృష్టి సారించవలెనని అభ్యర్థించడం. శివరామకృష్ణగారు రాజకీయోద్యమాలలో పాల్గొంటూ సాహిత్యరచన కుపక్రమించడం ముదావహం. సామాజిక దుష్ప్రభావాలమీద అధిక్షేపక కథారచన సాగించడంలో శ్రీ శివరామకృష్ణ గడుసరి.

జీవిత పోరాటాలలోని తమ అనుభవాలను, వివిధపద్ధతుల రచనలలో శ్రీ శివరామకృష్ణ తెలుగుదేశానికి అందిస్తున్నారు. ఇందుకు యీ కథల సంపుటి "నాంది" కాబోతున్నది. సంతోషం.

వస్తువుఎదుట అద్దంవుంచి దాని ప్రతిబింబాన్ని ఈ పీఠికలో పట్టడంకంటె, అసలు వస్తువునే దర్శించమని పాఠకులకు నా వినతి.

—అవసరాల సూర్యారావు

# విషయసూచిక

—"వ్యంగ్య రచనలు... శత్రువుల గుట్టును బట్టబయలు చేయడానికి ఉపయోగించే ఒక పద్ధతి... నిరంకుశ పరిపాలన దినాల్లో వాక్ స్వాతంత్ర్యం వుండదు... అందుచేత వ్యంగ్యంతో కూడిన రచనలతో నిరంకుశ వ్యతిరేక పోరాటం సాగించడం సరైనపద్ధతే—"

మావ్-సే-టుంగ్.

# తెలుగు ప్రాణి

'మంచి కథలు కావాలి. అవి ఉత్తమోత్తమంగా వుండాలి. అలాంటి వాటినే ప్రకటించి తెలుగు సాహిత్యానికీ, తద్వారా ప్రజానీకానికీ, పుష్టి, తుష్టి కలిగించాలి.''

ప్రతి సంపాదకుడూ యిలానే బయలుదేరుతాడు. యిలా బయలుదేరకపోయినా కనీసం యిలా అని ప్రకటిస్తాడు.

సరే! సంతోషం. కాని... ఉత్తమోత్తమం అంటే యేమిటి?

''రచనలో ఉద్వేగం వుండాలి. ఉత్త ఉద్వేగం చాలదు. భావనాశక్తి, శిల్ప ప్రావీణ్యం, సజీవభాష, పాఠకుణ్ణి పురకలు ఎట్టించి మనస్సును వూటలూరించే సంవిధానం, సందేశం, ఒకటా? వీటన్నిటికంటే ముఖ్యంగా ప్రజాజీవిత చిత్రణ—అదీ అభ్యుదయమార్గంలో వుండాలి.''

చాలా బాగుంది. అలా రచన వుండడం తప్పేమీకాదు. వ్రాయాలేగాని, వ్రాస్తే చాలా బాగుంటుంది. సందేహంలేదు. కాని వ్రాయడం ఎలా ?

ఏ అమెరికన్ రచయితకో అయితే యిన్ని చిక్కులేమీ లేవు.—రెండు సంపన్న కుటుంబాలు, వాటి మధ్య పరిచయం, ఆ రెండు కుటుంబాలకూ చెరో ఆడా మగా కుక్కలు, వాటికి మళ్లీ పరిచయం, ఆపరిచయం ప్రణయంలోకి పరివర్తనా, ఆ రెండు కుటుంబాలూ కొద్ది కాలం ఎడబాటూ, ఆ కుక్కల విరహం... యిలా గిలిగింతలు పెట్టుకుంటూ వెళ్లిపోతాడు. లేదా—ఓ నీగ్రో బాలిక కుక్కతో సంసారం. కాదా—ఓ నీగ్రో బాలిక అమెరికన్ని ప్రేమించి విరహంతో ఆత్మార్పణ చెయ్యడం; అమెరికన్ ఐ పుట్టాలేగాని అతనికి ఖూనీలూ బందిపోట్లూ అన్నీ కథావస్తువులే. పోతే ఎవరేనా 'హవార్డుఫాస్టు' లాంటి యింకా రచయితలున్నా, వాళ్లు అనమెరికన్లు. కనుక వారి విషయం వేరు.

ఇక ఏ సోవియట్ రచయితనో తీసుకుందామా ? అతనికేం ? మానవత్వపు విలువలుగల మహా వ్యక్తుల్ని సృష్టించగలడు. అది అతని కేమీకష్టంకాదు. ఉత్తమోత్తమ రచనకు కావలసిన అన్ని హంగులూ అతని సమాజంలోనే వున్నాయి. అతను ఆ సమాజంలోనే పెరుగుతున్నాడు. భవిష్యత్తు వైపుకు పెద్ద పెద్ద

అంగలు వేసుకుంటూ పోతున్నాడు.

ఎటొచ్చీ – మన తెలుగు రచయితమాత్రే మిటి ? ముప్ఫయియేళ్ళ సాముతోనూ మూలనున్న ముసలమ్మనైనా కదపలేని ఆంధ్రనాయకుల రాష్ట్రంలో పుట్టాడు. పదవుల కోసం పత్రికల్లోరేపే ఉద్యమాల గాలిదుమారంలో పెరిగాడు. ఆ నాయకుల గాలివుపన్యాసాలు తింటూ పెద్దవాడయ్యాడు. యింతవరదాకా ఇంగ్లీషులో ఆలోచించి తెలుగులో వ్రాయాల్సివస్తే – యికముందు హిందీలో ఆలోచించి వ్రాయాల్సిన తెలుగు భాష అతడిది. ఇంట్లో పెళ్లాం, వుంటే బిడ్డలూ, ముసలీ ముతకా అంతా— బ్రతకాలేని బ్రతికించాలేని యీ రచనా వుద్యోగంమీద చెరిగిపోసే తిట్లూ తిమ్మలమధ్య రచన కుపక్రమిస్తాడు. రచననుబట్టికాకుండా పేరునుబట్టీ — అదీ స్త్రీ వాచకమా ? కాదా ? అన్న భేదాన్నిబట్టీ అర్హతలు నిర్ణయించే పత్రికలకు పంపిస్తాడు. పుట్టిన దగ్గర్నుంచీ పుస్తకంమొగం ఎరగని పోలీసులు దాన్ని చదివి జనం చెడతారో పడతారో తేలుస్తారు.

తెలుగు రచయితగా పుట్టినంత పాపం అందులోనూ అభ్యుదయం లేక ప్రగతి ఏదేనాఅను. అదిగా వున్నంత మహా నరకం వేరే లేదనుకో...

అలాంటి రచయిత ఏం వ్రాస్తాడూ ?

"ప్రిజన్లోనే బ్రతుకుతున్నావుగదా ? –"

12

పన్నెండు

"బ్రతకడంలేదు. చావకండా వుంటున్నాను."

"పోనీ ఆ ప్రజాజీవితాన్నే–ఆ తెలుగుజీవితపు విలువల్నే"

"ఏమిటూ జీవితపు విలువ...?"

చుట్టూ ప్రతినిత్యమూ, ఏదో ఓమూలనుంచి తుపాకుల ఠాం ఠాం వినిపిస్తోంటే ప్రతి ఠాంకు ఒకజీవితం నేలకు ఒరుగుతోంటే; 'యిది అన్యాయం' అనలేక, అంటే మరో ఠాం వినవలసివస్తుందేమోననే భయంతో, — ఆ ఠాం తనమీదికో మరొకడి మీదికో, తెలియని ఆందోళనతో – చీమలకంటే కనాకష్టంగా యీడ్చుతున్న యీ తెలుగుజీవితాల విలువ యేమిటిబాబూ ! ఆ జీవితానికి ఆధారాలైన ప్రాణాలు పరకలకంటే హీనమై పోతుంటే— !

ఉదాహరణకు మా సీతారాముడినే చూడండి.

ఎప్పుడో ఇరవైయేళ్ళక్రితం పుట్టాడు. అందరు 'ఏకపుత్రులు' లాగానే అతిగారాబంగా పెరిగాడు. గారాలకూచీల సంగతి వేరేచెప్పాలా? స్వయంగా ఏపనీ చెయ్యలేడు. ఇతరులు చెప్పింది చెయ్యడానికి 'ఏమో' అనేభయం. చదువూ అంతగా అతకలేదు. బజార్లో పది మందిలో మాట్లాడ్డానికూడా సిగ్గే. "ఇలాంటివాళ్ళు గదా పాపం" అని ఏళ్ళు వూరుకుంటాయా? అవి అలా అలా పెరిగి పదహారేళ్ళ బాలాకుమారుణ్ణిచేసి వదిలాయి.

సరే-యిక యవ్వనపుపొంగులు. ఆపొంగుల్లో ఆడవాళ్ళకోసం వేట ప్రారంభించాడు. అన్నియిళ్ళకూ తిరుగడానికి వీలుగా నిప్పు అవసరం కలిగించే చుట్టా, బీడీ నేర్చుకున్నాడు. అలాగే కొద్దిమంది స్నేహితుల్ని కూడా ఆర్జించుకున్నాడు.

సీతారాముడు పెళ్ళినాటికే, ఒకటీ అరా కామ కలాపాలు జరపడం; ఒకావిడ భర్తచేత తన్నులు తినడం అదంతా ఓ విషాదగాథ—

ఈ పేచీలన్నీ చూచాకనే వాళ్ళనాన్న 'ఇక లాభంలేద'ని ఓ పెద్దపెళ్ళాన్ని తెచ్చి కట్టాడు.

కాని— 'తిరగనేర్చిన కాలు' మరి. అమావాస్యకూ, పున్నానికీ అలా అలా తిరుగుతోనేవుంది.

అందులోనూ ఆపెళ్లాంకుండా ఒక్కగానొక్క పిల్లే అయి పుట్టడంతో అతిగారాబం. చీటికిమాటికీ పుట్టింటి ప్రయాణాలు. 'నాకేం'? అన్న దిలాసా.

ఎలాగైనా అల్లుణ్ణి తమయింటికే తీసుకుపోతే, అన్ని విధాలా బాగుపడతాడనీ, చేతికీ కాలికీ అడ్డు వస్తాడనీ మామగారి ఆశ. కాని సీతారాముడు ఒప్పుకోలేదు. యిక వాళ్ళనాన్న సరేసరి. 'ఇల్లరికమా ?' అని హుంకరించాడు.

ఇలావుంటుండగానే ఆవూళ్లో కొన్ని మార్పులు

జరిగాయి. కుర్రాళ్ళంతా కలిసి యువజనసంఘం అంటూ పెట్టారు. ఆటలు, పాటలు, నాటకాలూ ప్రారంభించారు. నెమ్మది నెమ్మదిగా సీతారాముడింటో 'వ్యాసుపోక'కు తిరిగే జనంకూడా దొరక్కుండా పోయ్యారు. దాంతో తానుగూడా అందులో చేరిపోయాడు.

మొదట్లో అతడు నాటకాల్లో చేరడం ఆడవాళ్ళని తేలిగ్గా ఆకర్షించవచ్చనే. కాని రానురాను ఆడవాళ్ల సంగతే మరిచిపోయి తనవేషంలోనూ చదువులోనూ మునిగిపోయాడు.

'ఏమిటి ? యీనాటకాలూ వెధవ వేషాలూనూ' అని మొదట్లో తండ్రి పోరుపెట్టినా, కొడుకు బుద్ధిమంతనంచూచి, ప్రోత్సహించేదాకా వచ్చాడు.

యిప్పుడు సీతారాముడు చాలా మారిపోయాడు. తెల్లటి ధోవతిని వెనుక బిళ్ళగోచీ పెడ్తాడు; ముందు కుచ్చిళ్లు వదుల్తాడు. పొడుగాంటి లాల్చి వేస్తాడు. మీసాలు సన్నగా గొరిగిస్తాడు. యింట్లోవుండే కాలంలో అధికభాగం అద్దంముందు నుంచుని అభినయం అలవాటు చేస్తుంటాడు. బయటికి వచ్చాడో — ఏదో ఒక పుస్తకం తదేక దీక్షతో అలాగే చదువుతుంటాడు. ఎప్పుడేనా తన ముందరే ఆడవాళ్లు వెళ్తుంటే మాత్రం కళ్ళెత్తి చూడటం పోలేదు. ఓ క్షణంపాటు వాళ్ళ సౌందర్యాన్ని 'స్టడీ' చేసి మళ్లీ పుస్తకంలో తలదూర్చివేస్తాడు.

ఎప్పుడేనా ఏ పుస్తకం దొరక్క, ఏ రిహార్సలూ లేకపోతే ఏ యల్లామో జ్ఞాపకానికి వస్తుంది. కాని మాసిపోయిన అపఖ్యాతిని మళ్లా ఎందుకు కొనుక్కు తెచ్చుకోడమని మానుకుంటాడు.

ఇదంతా అతని భార్యక్కూడా సంతోష కారణమే. అయితే అదివరకు వూళ్లోని ఆడవాళ్లమీద వుండే కోపం — యిప్పుడు పుస్తకాలమీదికి మళ్ళింది. "పెళ్లి పెళ్లామయిన తాను ఆ పుస్తకాలపాటి చెయ్యదా ? . . .

.... యిలా వుండి వుండి సీతారాముడు ఆకస్మికంగా మారిపోయాడు.

పూర్వం ఆడవాళ్ల ముందు అయినవీ కానివీ అడ్డంగా కోసేవాడు; యీ మధ్య కాలంలో కనపడ్డ ప్రతివాణ్ణి నిలబెట్టి మరీ నాట్యకళమీద వుపన్యాసాలు దంచేవాడు; యిప్పుడు పిలిచినా పలకడంలేదు. ఒకవేళ పలికాడా !

"నిన్న వాడు - యీరోజు నేను - రేపు నీవు - ఎల్లుండి అంతా—" అంటాడు.

"ఏమిట్రా అదీ ?"

"అదే ! అదే !"

బయటికి పోనిస్తే అంతా యిలా వాగిస్తూ

రేమోనని వాళ్లనాన్న సీతారాముణ్ణి యిల్లు కదలనివ్వడం లేదు.

"ఏరా! నీవు పిచ్చాసుపత్రికి వెళ్లడం మంచిది"

"నిన్నవాడు - యీరోజు నేను - రేపు నీవు - ఎల్లుండి అంతా_"

"ఏమిట్రా ? అదీ"

"అదే - అదే"

భార్య గోలపెడుతోంది. మామకూడా దిగాడు అల్లుణ్ణి తీసుకుపోతానని - తండ్రికూడా ఆలోచించాడు. 'పొరుగూళ్లో ఐతే కొంత నయమేమో'! అని_

పట్టబలవంతాన ఎలాగైతేనేం అత్తగారింటికి వెంటారు. మందులిప్పిస్తున్నారు. సోదులడుగుతున్నారు. కాని సీతారాముడిది మానలేదు. పైగా ఒకనాటిరాత్రి పెళ్లాంతో "ఎల్లామనేనంటే పడిచస్తుందిగదా! మల్లామ అలా ఎందుకు పడిచావదు ?" అని బ్రహ్మాండమైన ప్రశ్న వేశాడు.

యికనేం ? మర్నాడే ఎల్లామ చేతబడి చేయించిందని దాన్ని తిట్టిపోశారు. దయ్యాలకు పెట్టించారు. తీయించారు. కాని సీతారాముడిది మానలేదు. భూత వైద్యుడన్నీ ఐ, వచ్చిన దారి పట్టుంటే అతడినే అన్నాడు.

"నిన్నవాడు - యీరోజు నేను - రేపు నీవు - ఎల్లుండి అంతా_" అని

యీ చేతబడిగోలతో ఎల్లామకు మాత్రం మొగుడిచేతిలో వాళ్లు హూనామయింది. కాని సీతా రాముడి పిచ్చి అల్లాగే వుంది.

ఎలా మాన్తుంది? రోగం ఒకటీ? మందు మరొకటీ ఐతే—!

*　　*　　*

సీతారాముడు ఎంతగానో ఉబలాటపడ్డాడు. నాటకం వెయ్యాలనీ, తనవేషం మహాద్భుతంగా వుండాలనీ. రాత్రింబవళ్లూ అదేపనిగా అవస్థపడ్డాడు. ఎల్లామ, మల్లామ, తన భార్య, జనం, అంతా ఎలా తనని పొగుడుతారో—!? అంతా కలలుగన్నాడు.

నాటకం నాటి రాత్రి. వేషం అంతా అయి పూర్తి ముస్తాబులో వున్నాడు. తెరల సందుల్లోనించి చూస్తోంటే — జనం మహాసముద్రంలా కన్పిస్తున్నారు. ప్రార్థన కూడా అయింది. తెర ఎత్తారు. మరుక్షణంలో తాను రంగంమీాద నిలబడబోతున్నాడు. ఆజన మహాస ముద్రపు దృష్టులన్నీ తనమీాద కేంద్రీకరించబడబో తున్నాయి.

యింతలోఆకస్మికంగా పిడుగుపడ్డట్టు......

"నాటకం ఆపండి...."

"ఎందుకు?" ఎవరో అడిగారు. సీతా-

రాముడుకాదు ఆ అడిగింది. అడిగేట్టుకూడా లేదు. కొయ్యబారిపోయాడు.

"ఈ నాటకం ఆడితే ప్రజలు చెడతారు. శాంతిభద్రతలు ఇరుకున పడ్తాయి." వచ్చింది సమాధానం.

"మీరు చూడండి. ఈ నాటకంలో అలాంటి దేమీ లేదు."

హెడ్‌కానిస్టేబుల్ పుస్తకం అందుకున్నాడు. ఎడమచేత్తో పుస్తకం అడుగు పట్టుకున్నాడు. కుడిచేతి బొటనవేలు పైని ఆనించాడు. గిరుగ్రిన తిప్పాడు ప్రతి పేజీనీ ఆ బొటనవేలు తాకిచూచింది. పుస్తకం చూట్టం పూర్తయింది.

ఎందుకో తటపటాయించాడు హెడ్డు.

"పుస్తకం వ్రాసినవాడు తిరుగుబాటుదారండీ!"

"యీ తెరలుచూడండి. లక్ష్మిగాని, సరస్వతిగాని, చివరకు మన హనుమంతుడుగానీ వున్నారేమో! వట్టి తెరలండీ. వట్టివి."

"ఈ తబలాకు చుట్టిన గుడ్డ చూడండి. ఎర్రగా"

వరుసాగ్గా దండకం చదువుకుపోతున్నాడు. ఆవూరి మోతుబరీ ఆసామిగారి బావమరది.

"సరే. ఆపండి నాటకం" హెడ్డు అన్నాడు.

"చూడండి. ఎన్నో వూళ్లనుంచి జనం వచ్చారు. తీరా యిప్పుడు..."

హెడ్డుతలకాయ కొంచెం మెత్తబడింది. కురిసే మంచుకుగాదు, అంతమంది జనాన్ని చూచి. జేబులో వెచ్చగా తగిలింది హెడ్డుకు.

"ఏమైనాసరే! నాటకం ఆపితీరాలి."

"ఆడతాం. ఆపం." అన్నారు ఎవరో...

ఆ అన్నవాడివంక చూచాడు హెడ్డు ఎర్రగా —అతగాణ్ణి అరెస్టు చేశానన్నాడు.

"ఎందుకో?"

అది బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని అడగాలి. ఆ కామన్వెల్తు కూటమి నడగాలి. ఆ కామన్వెల్తు సంబంధాలతో ఆసియాకు నాయకత్వం వహిస్తావనే భారతదేశం చెప్పాలి.

మొత్తంమీద జరిగిందిదీ. నాటకం ఆగిపోయింది. జనం షాహుకార్ని, పోలీసుల్ని తిట్టుకుంటూ వెళ్లిపోయారు.

షాహుకారుమాత్రం—తన ముఠావేసే తారాశశాంకం కంటే పిల్లు ముందు ఆడకుండానూ, అసలే

ఇరవై

యిలాంటి నాటకాలు ఆడకుండానూ చేయించి, తన ఘరానా నిలబెట్టుకున్నందుకు సంతోషపడ్డాడు.

యింత జరుగుతూంటే సీతారాముడు పులకా పలకా లేదు. ఆరాత్రింతా కన్నుముయ్యలేదు. కదలా మెదలా లేదు. మర్నాడల్లా అంతే. మర్నాటిసాయంత్రిం పీకివేసిన పందిరిగుర్జులూ, రంగులు తుడుచుకున్న గుడ్డ పీలికలూ అన్నీ చూస్తూ అన్నాడు. తన నాటకం గురువును అరెస్టుజేసినసంగతి గుర్తుకొచ్చి అన్నాడు.

నిన్న వాడు - యీరోజు నేను - రేపు నీవు - ఎల్లుండిఅంతా—" అని.

యీ విషయం అందరికీ తెలుసు. కాని వాడి రోగానికి కారణం యిదనిమాత్రం ఎవ్వరూ అనరు.

కాలం దొర్లిపోతోంది. మాటల్లోకి దించితే యీపిచ్చ వదుల్తుందేమోననుకున్నారు.

చూడవచ్చిన చుట్టమల్లా కూర్చోబెట్టి మరీ తెగమాట్లాడుతున్నారు. అందువల్ల సీతారాముడి ధోరణి యింకా పెరుగుతోంది. ఔనుమరి! ఆ వచ్చినవాళ్లు మాత్రిం ఏం మాట్లాడుతున్నారు?

ఏ ఉత్తర హిందుస్థానం వాళ్ళో ఐతే మతకల హోల మీద మాట్లాడుదురు!

పట్టాభిగారైతే శరణార్థులమీద మాట్లాడును

రంగాగారైతే మిలటరీపాలన అవశ్యావశ్యాన్ని గురించి మాట్లాడును!

రాజేన్‌బాబూ ఐతే బుద్ధుడి అహింసావిధానాన్ని వర్ణించును!

ఈ మాట్లాడే వాళ్ళంతా తెలుగు నాయకులన్నా కాదాయె. తెలుగువాళ్లు. వృత్త తెలుగువాళ్లు. పాపం! వాళ్లేమి మాట్లాడ్తారూ? కన్నవీ, విన్నవీ—

"ఆవూళ్లో జనాన్ని నిద్రలో లేపి మరీ చావబాదారు."

"అదే—అదే" సీతారాముడు అనేవాడు.

"కందిచేలో ఒకణ్ణి కాల్చారు."

"ఎక్కడెక్కణ్ణుంచో పట్టుకొచ్చి మావూరి పొలిమేరలో కాల్చారు."

"నిన్న వాడు - యీరోజు నేను—రేపు నీవు—ఎల్లుండి అంతా-" ప్రతిదానికీ యిదే వరుస సీతారాముడిది. కాకపోతే అప్పుడప్పుడూ "అదే - అదే" అంటుండేవాడు.

విశ్రాంతికని ఎక్కడెక్కడో తిరిగాను. కాని అక్కడక్కడా బస్సుల్లోనూ, రైళ్ళల్లోనూ, హోటళ్ళల్లోనూ అవే కబుర్లు విన్నాడు. ఔనుమరి. తెలుగుదేశంలో అంతకుమించి ఏమున్నాయి? వినేందుకు —

# ౨౨

ఇరవైరెండు

సీతారాముడిప్పుడు యింటిపట్టునే వుండడం లేదు. సీతారాముణ్ణి ఏంచెయ్యాలో ఎవ్వరికీ తోచడంలేదు.

ఒకరోజున సీతారాముడికేం పుట్టిందో — ఆ రోజల్లాయింటి మొగమే చూళ్ళేదు. చీకట్లోలేచి దేవాలయంలోకి వెళ్లాడు. పసుపు కళ్ళాలకి వెళ్ళాడు. బీట్లోకి పోయాడు. కాట్లోకి పోయాడు. పట్లోకి పోయాడు. మళ్ళీ వూరువేపు మళ్ళాడు

వెనకనుంచి 'భర్-భర్ర్–' వినిపించింది.

తిరిగి చూచాడు. దుమ్ము లేస్తోంది.

"లారీ_లారీ" యిన్నాళ్ళకు యింకోమాట మాట్లాడాడు సీతారాముడు.

పరుగెత్తబోయాడు. పడ్డాడు. లేవబోయాడు. పడ్డాడు. పడి – పడి – పట్టుబడనే – పడ్డాడు.

మామా, పెళ్లాం, తండ్రీ, అంతా గొల్లున గోలబెట్టారు.

"నిన్న వాడు – యీ రోజు నేను – రేపు మీరు"

సీతారాముడి గూబ గుయ్యిమని కదిలింది. మామా, తండ్రి, పెళ్ళాం కళ్ళు గిరుక్కున తిరిగాయి.

"చెప్తావా? లేదా?" సీతారాముడి రెండో దవడపగిలింది.

''అదే అదే'' అన్నాడు సీతారాముడు.

చీలమండ విరిగింది. "తేల్చు-ఊం''

''నిన్న వాడు-యీరోజు నేను-రేపు మీరు-''

''ఏమిటది?'' తుపాకిసన్నీ రొమ్ముల్ని ఆనుకుంది.

''అదే-అదే-''

చుట్టూ 20 తుపాకులు కాపలా కాస్తుండగా సీతారాముడు లారీలోపడి వెళ్లిపోయాడు.

ఆ తర్వాత 10 రోజులకల్లా ఆంధ్ర దేశానికంతా తెలిసింది. పత్రికల్లో పడి :-

సీతారాముడు ఏయే దాడుల్లో పాల్గొన్నాడో ఎంతమందిని హత్యచేశాడో ! ఆ చివరిరోజునకూడా 15 తుపాకులమీదా, ఒక్క గొడ్డలితో ఎల్లా విరుచుకుపడ్డాడో ! అంతా వివరంగా

ఒక్కటే విచారం... తన వీరోచితత్వాన్ని పత్రికల్లోనైనా చూచుకోలేకపోయాడు సీతారాముడు.

ఏమనుకుంటే ఏమిలాభం? వాడి పెళ్లాం, మామా, తండ్రి, అంతా వాడి ప్రాణాన్ని ఎంతగా చూచుకున్నా ఆప్రాణం విలువ ఒక్క తుపాకి గుండే...

---

## పాపభీతి

"ధర్మములలోకల్లా భూతదయ సర్వోత్కృష్ట మైనది..." పిల్లవాడు కంఠతా పెడుతున్నాడు పాఠం–

తల్లి వింటూ భూతదయమీద మనస్సును లగ్నం చేస్తోంది.

బయట జోరున వాన కురుస్తోంది.

ముష్టి ముసిల్ది వానలో తడిసి ముద్దై వడవడ వణుక్కుంటూ వరండాలోకి చేరింది.

''ఎవత్తివే? వరండా పాడుజేస్తూ–పో–''

''పడుకోనీలే అమ్మా! పాపం–వాన''

'' దొంగముండల్రా...సర్లే! పడుకోవే. ''

పాఠం మహాత్యం పనిజేసింది.

''ఏనాటి కర్మో! ఒక్క ముద్దేనా దొరకలా."

''వుసూరుమంటూ వూ కెందుకా వుసురు. పో ముందు. పోతావా..."

''అయ్యో–తల్లీ'' ముసిల్ది 'ఉస్సురు' మంటూ చీకట్లో కలిసిపోయింది—

పిల్లవాడు ఆవులించి 'భూతదయ'ని మూసే శాడు—

# అంతరాత్మ అంత్యక్రియలు

"ఏమిటీ ఘోరం ?" అడిగింది. అంతరాత్మ- అంతరాత్మ కళ్లుమూసుకుని కాస్త అటూయిటూగా మూడేళ్లవుతోంది. యిన్నాళ్లుగా చూడక చూడక గభీమని ఒక్కసారిగా చూడటంతో - కొంచెమేం ఖర్మ ? బాగానే గాభరాతిన్నది. ఆ గాభరాలో అలా అనేసింది.

ఐతే ... యీ మూడేళ్ళ మూతలోనించి అమాంతం బయటపడ్డ అంతరాత్మ గనుక అలా గాభరా తిన్నది. కాని ఆత్మకేమీ ? రోజూ అలాంటివి లక్షలు చూస్తూ అలవాటు పడిపోయింది. అందుకనే అంతరాత్మ అడిగిన ప్రశ్నను అలా ఖాతర్ చెయ్యలేదు.

బహుశా- అంతరాత్మ అడిగిన 'ఘోరం' ఆత్మకు వినపడ్డదో, లేదో కూడా.

ఆత్మ - ఈమధ్య చాలాకాలంనించీ వినేందు కూడా తీరికలేనన్ని ఉపన్యాసాలు, స్టేట్మెంట్లూ అధికోత్పత్తి చేస్తూ సతతం హతమై పోతోంది.

కాక... మూడేళ్లుగా ముక్కుమూసుకున్న అంతరాత్మ మామూలుగానే అలావుందో !

ఇరవైఆరు

లేక... ఆత్మ, అధికార ... పూరిత బధిర శవంలా వుండి వినిపించుకోనేలేదో !

ఏది ఏమైనప్పటికీ—

"ఏమిటీ ఘోరం ?" మళ్ళీ అడిగింది. అంతరాత్మ.

"ఏమిటో ఘోరం !" ఎదురడిగింది. ఆత్మ

"ఇదే—"

"ఏది ?"

"యీ ఆకలి చావులూ...." చెప్పుకు పోబోతోంది. అంతరాత్మ—

"చావడానికి ఆకలే కారణమా ? సవాలక్ష కారణా లుంటాయి."

"ఆకలి మాత్రం ఎందుకు కారణం కాగూడదూ ?"

"అదీ-బాధ్యతారహితులు మాట్లాడేమాట. దురాశాపరులను రెచ్చగొట్టేవాడి మాట..." భగ్గు మన్నది ఆత్మ— పొడుగ్గా ఓ మూలుగు మూలిగింది. అంతరాత్మ

"ఆకలితో యీదేశంలో ఒక్కడూ చావ లేదని స్టేట్ మెంట్లు యిచ్చాం. అంతే! యిక యిప్పుడు

అలా ఎవ్వరూ చావరు. అలా ఆకలి చావులని ఎవరూ అనరూ,అనకూడదు.''

''మరి యీ...హాహాకారాలు___?''

''అవా? అవీ....'' నీళ్ళు నమిలింది ఆత్మ. ''అవీ... 'తిండి కొరత' అనీ___''

''మరి యీ తిండి కొరతకు ఏంచేస్తున్నట్టు?'' లంకించుకుంది. అంతరాత్మ

ఆత్మ ఒక్కసారి గుడ్లు పైకి త్రిప్పింది. క్రిందికి త్రిప్పింది. తెల్లటి టోపీతీసి టేబుల్ మీద పెట్టి కాస్సేపు గింజుకున్నది. చివరకు ___

''దానికి చాలా గ్రంథం వుందిలే!'' అన్నది.

''భగవద్గీత అంతవుంటుందా?''

''భగవద్గీత, బైబిల్, ఖురాన్‌లు కలిపితే దానికి మూడురెట్లు వుంటుంది.'' చెప్పింది ఆత్మ - యీ గొడవ తప్పించాలని.

''ఏదీ ? మచ్చుకు కొంచెం...'' బ్రతిమాలింది అంతరాత్మ - కుతూహలం కొద్దీనూ.

''కరువు తీరేందుకు రేషన్‌గింజల పరిమాణం తగ్గించేశాం'' చెప్పుకుపోతోంది ఆత్మ,

''అదీ-కరువును పంచడం అవుతుందిగాని, తీర్చడం అవుతుందా ! మరి... ఆందోళన పెరగడం లేదూ ?''

# ౨౮

## ఇరవైయెనిమిది

"ఆందోళన అరికట్టేందుకు, ప్రజారక్షణ చట్టం మాట అలావుంచి-ప్రతి వోటూ నిల్వాలు 'నింపుకుని' వున్నట్టు ప్రకటిస్తున్నాం."

"ఆఁ !-అఁ ?" నోరు తెరిచింది. అంతరాత్మ

"విదేశాలనించి వచ్చే స్టీమర్లు ప్రకటించాం. వారానికి ఓపూట నిరాహార వుద్యమం లేవదీశాం. ఆకులు తినడంలోగల ఆరోగ్యం, గడ్డితినడంలోగల గట్టితనం, ప్రచారం చేశాం. చేయిస్తున్నాం."

అంతరాత్మ 'ఆ' కొట్టడంకూడా లేదు. చెవులు, నోరు, పళ్లూ, కళ్లూ, సర్వస్వంతో తెగవింటోంది.

"ఆకులకంటే గడ్డికంటేగూడా, గాలిమేస్తే యింకెంత ఆరోగ్యమో పరిశీలించేందుకు ఓ ప్రముఖుల కమిటీని వెయ్యాలని చూస్తున్నాం. ఆహారం పొదుపుకుగాను పెద్దపెద్దవాళ్ల తాలూకు భార్యలతో అఖిల భారత ఆడవాళ్ల సంఘాన్ని ఏర్పరిచాం-"

"వీటితో కరువు ఎలా తీరుతుంది ?" అంతరాత్మకు ధర్మసందేహం కలిగింది.

"మొదటే చెప్పాను. ఇది మహాగ్రంథమని" విసుగుకున్నది ఆత్మ-. అయినా బాధ్యతను గుర్తించింది కనుక యింకా ఓపికతో-

"వీటివల్ల కరువు తీరదు కనుకనే అధికోత్పత్తి

సంఘాలూ, సలహాసంఘాలూనూ—''

ఐనా, అంతరాత్మకు సంతృప్తికలిగినట్టులేదు.

"పేదను పిడకలు చెయ్యగూడదని చెప్పాం. యింకా- ముఖ్యంగా…"

"స్వతంత్రం పొందిన మూడుసంవత్సరాల కైనా -మ్ఛ'' అంతరాత్మ తల అడ్డంగా త్రిప్పింది.

"ఏమిటీ? మూడు సంవత్సరాలా? ఎవ రన్నారు? భారతదేశం సర్వ స్వతంత్రి ప్రజాతంత్రి రిపబ్లికై- ఎన్నోనాళ్లుకూడా కాలేదు.'' నిప్పులు కక్కింది. ఆత్మ

అంతరాత్మ ఏమీ వాదించదలచుకున్నట్టు లేదు. మెల్లగా—

"పోనీ- జన సామాన్యానికి బంజర్లు పంచితే!'' అన్నది.

"పన్నులు చెల్లించడానికే ఏడుస్తోన్న జనం బంజర్లు ఏంపెట్టి పండిస్తారు?'' సవాల్ చేసింది ఆత్మ. సవాల్ చేసి వూరుకోలేదు.

"ఓ కరాచీ కాంగ్రెస్ నాటి పాతచింతకాయ పచ్చడీ! యిది పందొమ్మిదివందల ముప్పైలు కాదు, యాభైలు. 'తుస్సు' మని తిప్పడానికి యిది రాట్నంకాదు; తాడూ తంకరాలేని అశోకచక్రం. ..., అంటే పహ

ముష్కి

గెత్తడానికి యిది జైలుకాదు; అధికారపీఠం—" అని విపులంగా బోధపరచింది. ఆత్మ

"అయితే- యీ భారతమాత సుపుత్రులు యిలా తిండికరువుతో తీరిపోవలసిందేనా?" అంతరాత్మ కళ్లు చెమ్మగిల్లాయి.

"జనాభా తగ్గుతుంది, భూ భారం తీరుతుంది. మంది పల్చనయితే మజ్జిగ చిక్కన అవుతాయి." అన్నది ఆత్మ.

"హా! రత్నగర్భా! అన్నపూర్ణాదేవీ! సుజలాం సుఫలాం! ప్రపంచ నైతికశిఖరం! భారత దేశం!..."

—భవిష్యత్ భారత శ్మశానాన్ని తలచుకొని వణికిపోతోంది. అంతరాత్మ

ఆత్మకు కొంచెం జాలికలిగింది.

"...ఇదుగో...హిందువైన ప్రతివాడికీ అతి పవిత్రమైన, సప్తసంతానాలలో, ఒకటైనటువంటి వనప్రతిష్ట ప్రారంభించాం. దానికో వారం పెట్టాం. ఒక్కవారంలో కోటి మొక్కలు...కోటి..." అన్నది ఆత్మ.

అంతరాత్మ చెవులు రిక్కించింది.

"ఈ మహోత్సవం సర్వసంపూర్ణ స్వతంత్ర భారత ప్రథమాధ్యక్షుడు తులసిమొక్క నాటడంతో ప్రారంభమయింది. తులసిమొక్క..."

"తులసిమొక్కా...?"

అంతరాత్మకి అర్ధ నిమీలితాలు పడ్డాయి.

"ఆఁ. తులసిమొక్క."

"తు...లసి... మొ...క్క..." అంటూ గుడ్లు తేలవేసింది అంతరాత్మ. నోరు అలాగే వుండి పోయింది. కాని – గొంతులోని 'గుట గుట' మాత్రం – బధిరశవమైన ఆత్మకూడా స్పష్టంగా వినిపిస్తోంది.

అహింసకు అపరావతారమైన ఆత్మ– ఆఅవస్థని చూడలేకపోయింది. ఎకాయెకీ రాజఘాట్‌కు వెళ్లి పోయింది. అధ్యక్షుడు నాటిన తులసిమొక్కనించి రెండే రెండు ఆకులు తెచ్చింది.

అంతరాత్మ అంగిట్లో తులసితీర్థం కురిసింది. వివిధరాష్ట్ర, కేంద్ర ఆహార నిర్వాహకుల తాలూకు సగటు అంతరాత్మ 'హరీఁ!' అన్నది.

ఆత్మ శనికాస్తా విరగడైపోయింది.

---

# 39

## స్వాతంత్ర్యం

అతను ఓ పెద్ద రచయిత. చతుర్విధ స్వాతంత్ర్యాలూ అక్షరాలా అమలు జరగాలనే పట్టుదలగల వాడు. ఓ ప్రసిద్ధ జాతీయవాదిచే నడుపబడుతోన్న పత్రికకు సంపాదకుడుగా పనిచేస్తున్నాడు.

ఒకరోజున ఆకస్మికంగా పత్రికాధిపతి అతనికి శ్రీముఖం అందించాడు.

''ఆఁ! ఉద్యోగంనుంచి తొలగించారా? కారణం?

"ఔను. మీరు నిన్న పత్రికా రచయితల సంఘానికి అధ్యక్షత వహించారట.''

''ఔను. కాని–మీరు నా స్వాతంత్ర్యానికి ఎలాంటి ఆటంకాలూ వుండవన్నారుగదా! మొదట–''

''ఇప్పుడుమాత్రం? – నిన్ను ఉద్యోగంలో వుంచడమా? మానడమా? నిర్ణయించే స్వాతంత్ర్యం నాకున్నది. ఆ స్వాతంత్ర్యాన్నే నేను అమలుజరుపుకొంటు న్నాను. అంతే. స్వాతంత్ర్యం చాలా పవిత్రమయింది. దాని రక్షణ ప్రతివారి విధి.''

అతనికి అర్థమయింది.

—వర్గసమాజంలోని స్వాతంత్ర్యానికి అర్థం.

౩౩

# ప్రతిఫలం

''దొరగారొస్తారు. పని పూర్తి కావాలి. కాక పోతే ప్రసిడెంటుబాబుగారికి మాటొస్తుంది.''

అదీ–ఆకూలివాడి ఆరిపోయే గొంతుకలో నించి, శరవేగానవచ్చి, ఎండిపోయిన రెండు పెదవులమధ్య నలుగుడుపడుతోన్న ఆ 'ఆరాటం'.

'ఎందుకబ్బా? అంతగా–'

''సామిగాడు పోటీకి రాకపోయినట్టయితే పావలా యిచ్చేవారు. ఐనా ఆడడిగిన మూడణాలకే పని నాకేయిచ్చారు. దయగల్ల తండ్రులు–''

'అందుకూ ఆ కృతజ్ఞత'

ఒక్క ఆకైనా కదలాడడం లేదు. ఎండ నిప్పులు చెరుగుతోంది. కరిగే కండలు కారే చెమటల్లో పొక్కి పోతున్నాయ్.

'ఒక్కడనే పలుగువేయడం, మన్నుతీయడం–యిబ్బడి చాకిరీ అయింది. కూలికి మించినపని.'

'ఏమో!– దాని కొప్పుకోకపోతే?'

'చేతులు ముడుచుకుని యింటికాడకూచుని మాత్రం చేసేదేముందిలే. పిల్లాడికి పుస్తుకన్నావస్తది.''

'అదీ నిజమే. పేదసంసారం'

'ఉశ్ !అబ్బా!! నరాలు చేదుకుపోతున్నాయ్. పని పూర్తయ్యేట్టు లేదే ?'

'ఏమబ్బా! అలా రెక్కలు ముక్కలైసుకో పోతే. రోజల్లా పని చేయడమేగా? ధర్మం.'

''బాబుగారు నన్ను నమ్మి యీపని పురమా యించారు. యీ కాస్తదానికి రెక్కల్దాచుకుని పాపం కట్టుకునేదా? యిల్లాగే నిలబడి యింకో వూపు వూపితే-''

మూడు గంటలయింది.

''నాలుక పిడచగట్టుకుపోతోంది. దాహం. దగ్గర్లోనే చెరువు. వూపిరుండగానే అక్కడకు చేరుకుంటే ఎవరో ఒకరు యిన్ని నీళ్ళు పొయ్యకపోతారూ ?''

—దారికి ప్రక్కగా చెరువుకట్టక్రింద నుంచు న్నాడు. బిందె బుజానపెట్టుకుని ఓ నల్లపైరేళ్ళ విధ వావిడ—.

''అమ్మగారూ! అమ్మగారు!!'' కూచోని దోసిలి బట్టాడు.

''ఓరి మాలముండాకొడకా'' బిందెడునీళ్ళూ క్రింద గుమ్మరించి తిరిగీ చెరువుకు పోయిందావిడ.

నోట మాట రావడంలేదు. వాచారబట్టి సంజ్ఞచేస్తున్నాడు.

ఒకరు—యింకొకరు — మరొకరు — వరుసగా వస్తున్నారు. పోతున్నారు. అంతే—

యీడిగలబడి పోయాడు.

దారినే గొడ్లతోలుకుపోతున్న రెడ్లకుర్రాడు గబగబాపోయి పైనున్న పంచె చెర్లోతడిపి తెచ్చాడు. తల తొడమీద పెట్టుకుని నోట్లో యిన్ని నీళ్లు పిండాడు. అందుకు—కోమిటోరి మంగమ్మ చేతులు రక్షాకిస్తూ, ఆ కుర్రాడి దీపమే ఆర్పిందా? కుదురే కూల్చిందా, వైనవైనాలుగా—అబ్బో!

—బాగా తెలివి వచ్చింది. ప్రొద్దువంక చూచాడు.

"అమ్మయ్యో! దొరగారువచ్చే వేళయింది. ప్రొద్దు వాటాలింది. బాబుగార్ని ముంచేశానే—"

కాళ్ళీడ్చుకుంటూపోయి పని మొదలెట్టాడు. తత్తరపడుతున్నాడు. ఆ తొందర్లో పలుగు కాలిమీద వేసుకున్నాడు. రక్తం వరదలైపోతోంది. తలగుడ్డచించి కాలికి చుడుతున్నాడు.

"బాబుగారి పనికన్నీ అంతరాయాలే కల్పిస్తున్నాడే! పాడుదేవుడు. నామాలాన్న బాబుగారికి మాటొచ్చే రోజొచ్చింది. సామిగాడే ఐతే పనిపూర్తి అవ్వదేమో?!"

"ఏం మామా! పని పూర్తయినట్టే వుందే? ప్రసిడెంటుగారి తిక్క వొదిలించావులే." అని వెటకారం చేశాడు. దారేపోతూ సోమిగాడు.

"ఆ! ఎంతమాట" గుండెలలోనుంచి కరుక్కున దూసుకుపోయింది.

ఆదార్నే గురవడు పోతున్నాడు.

"ఒరే గురవన్నా! ఓ అణాడబ్బులిచ్చుకుంటాను. యిది కాస్త తవ్విపెడుదూ. దొరగారొచ్చేస్తుండాలి—"

గురవన్న పలుగేస్తున్నాడు. ఆ ఊడిపోయే కట్టుగుడ్డతో కారే రక్తాన్ని మూటగట్టుకుంటూ మట్టి తీస్తున్నాడు.

పనిపూర్తయింది. యింకోఅరగంట ప్రొద్దుంది.

'టక్-టక్-టక్-' బూటు చప్పుడుతో కళ్ళజోడు తుడుచుకుంటూ ప్రసిడెంటుగారు వొస్తున్నారు.

"బాబుగారు! పని పూర్తయింది."

అన్నాడు ఎదురుబోయి మొగం చాటంత చేసుకొని—

"భేష్! మంచివాడివి. నీ కెంతిచ్చినా దండుగ లేదు." అన్నాడు ప్రసిడెంటు లాల్చి జేబులోంచి పర్సు బయటికి తీస్తూ.

'బాబా ! చుక్కకి చిన్నబిడ్డనొప్పి వొచ్చిందట అమ్మరమ్మంది.' అన్నది కూతురు.

"బాబుగారూ! వెళ్తాను" అని దణ్ణంపెట్టాడు.

"దొరగారొచ్చేస్తున్నారు. ఐపోయింది. వెళ్లు దూగాని"

"బాబుగారు ! పిల్లకి–"

"ఏం పర్వాలేదు"

"ఇంట్లో మీా జీతగత్తె ఒకటేనండి. దాని కేవీా తెలవదు."

"పక్కవాళ్లొచ్చి చూస్తారులే"

ఆఘోరణకి నిర్ఘాంతపోయాడు. కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

"బాబుగారూ—! యెల్తానండీ—!"

"వెళ్తావూ? బాగానేవుంది. ఏదైనా మళ్ళీ సరిచెయ్యాలంటే అందుకు మళ్ళీ యింకో కూలీనా? దొరగారొచ్చిం తర్వాత—"

"మీా పాదాలకాడ బతికేవోణ్ణి. పనికూడా సాంతంజేసాను. కనికరించండిబాబు.!"

"వీల్లేదు. ఇది రోజుకూలీగాని, కంట్రాక్టు పనికాదు."

"కాంట్రాక్టుపని కాదు." అతడిహృదయం జలదరించిపోయింది. ఆమాటనే తిరిగి అనుకున్నాడు. 'కాదా' అని సందేహం.

"ఔను, ధర్మమే, కంట్రాక్టుపనికాదు"— తనలోతానే సమాధానం—

"ఇప్పుడే వస్తాదొరా! ఒక్కసారి—"

"చెబుతోంటే ఆగడంగావుంది, అవసరమైతే నీతాతగాడెవడున్నాడిక్కడ— పోయావో- నీకు చిల్లి దమ్మిడీరాదు."

'చిల్లిదమ్మిడీ రాదు' ప్రొద్దుట్నుంచీ ఎంతో కృతజ్ఞతతో - మాటకోసం - ఒంటరిగాడైకూడా చేసిన ఇబ్బడి చాకిరీకి ఫలం — 'పోయావో చిల్లిదమ్మిడీరాదు' పోకపోతే - జబ్బుచేసినపిల్లను పెట్టుకుని ఒంటరిగా కాకి గోలగా ఏడ్చే అమాయికురాలుపెళ్ళాం— చుట్టూ ఏమీ తెలియక గగ్గోలుపెట్టే పసికూనలు- పొరుగువాళ్ళు మాత్రం అప్పుడే పనిలోంచి రానచ్చారా—?

అదీ—ఇదీ అతని హృదయాన్ని వంతులు వేసుకుని బాధిస్తున్నాయి. 'పోయావో— చిల్లిదమ్మిడీరాదు!'

ఆ రాత్రి కా సంసారం ఉపవాసాలు చెల్లించాల్సిందేనా? గడచిన దినాల బాధలు పుర్రెలో తిరుగుతున్నాయ్.

"బాబా!" అని పిల్ల చెయ్యి పట్టుకుని లాగుతోంది.

అంతలో మళ్ళీ పిల్లను గురించిన — ఆవేదన—

"మూణ్ణాల కూలీకోసరం పిల్లను వదిలెట్టుకోనా? ఎంత కటికగుండైనా—" మాట్లాడకుండావంగి, తన కాలి నెత్తురు రుచిమూచిన పలుగుని బుజానెత్తుకుని గబగబా నడిచాడు.

పోయేవాడివంక చురచురామూస్తూ తల వూపాడు ప్రసిడెంటు.

యింతకూ ఆవేళ దొరగారు తనిఖీకీ రానూ లేదు; రోజల్లా కష్టపడ్డా కూలీ ముట్టనూలేదు.

గురవడుమాత్రం అణాకోసం గుడిసెముందు రోజుకు ము - మ్నారు.

---

# వెనకడుగు

ఇసుకవేసినా రాలనంత జనం. సూదిపడినా వినపడేటంత మౌనం.

ఒక ఉపన్యాసకుడు ప్రజలసమస్యలు, వారు పడుతోన్న కష్టాలు, అందుకుకారణాలు, నివారణ మార్గాలు సూటిగా వివరించుతోన్నాడు.

అయితే...బురఖా కాంగ్రెస్‌వాదులు అని పదే పదే వాడుతున్నాడు.

వినీ వినీ - అక్కడి సామాన్యులకు ఓ అనుమానంతోచింది. అందులో ఒకడు గభీమని లేచాడు.

" అయ్యా! మీరు ప్రతిసారీ ' బురఖా కాంగ్రెస్ వాది' అంటున్నారే! అర్థం- ? "

" నిజమైనకాంగ్రెస్‌వాది కాడని, కాంగ్రెస్ ముసుగు వేసుకొన్నాడని- "

" ఓహో! అలాగా? మీరింకో అడుగు వెనకున్నారన్నమాట. ఈ రోజుల్లో కాంగ్రెస్ అంటేనే బురఖా అని మా అర్థం. మా అనుభవం-కానివ్వండి- "

—:o:—

# పేదరికం

"ఏం? ఇవ్వాళన్నా ఇటుతగలడేదుందా?" అడిగేవాడు మొగుడు.

"ముదనష్టపుగోల. రోజూ ఒకటేగోల" అనేది పెళ్లాం.

"సరే! నన్ను చంపు. ఈ గోలవదుల్తుంది" చెప్పేవాడు మొగుడు.

"యింకేం! పిల్లల్ని ఊ.... కని దరిద్రుల్ని చెయ్" అంటుంది పెళ్లాం.

"చేసుకున్న మొగుడెటుబోతే యేంలే!" అనేవాడు మొగుడు.

"కనుకున్న బిడ్డలేమైతేయేంలే!" అనేది పెళ్లాం.

"నీపుణ్యెం వూరుకో. ప్రక్కవాళ్లు వింటారు" నోరుమూసుకునేవాడు మొగుడు.

"స్వంత ఆస్తులమూలాన్ని ఎన్ని గొడవలు పుడుతున్నై రా భగవంతుడా!" అనుకునేవాణ్ణి నేను.

రోజూ యిదీవరస. సరిగ్గా నేను మా యింట్లెపాదినీ నిద్రబుచ్చి, కలమూ కాగితాలూ ముందు వేసు

కర్కారోహ్చేడమూ, వాళ్ళు యీ ప్రణయం ప్రారంభించడమూ ఒకేసారి.

మాయింటి కానుకునే వాళ్ళడాబా. అది చాలా పెద్దది కూడాను. ఆ యింట్లో వుండే మనుషులు కూడా దానికి తగినంత పెద్దవాళ్ళ్యానూ – వాళ్ళు ఒక్కసారికి ఒక్క రైతేనే ఆ డాబాలో ఏవాకిలికైనా సరిపోయేది.

ఇక రెండేళ్లు రెండేళ్ళు తేడాతో ముగ్గురు మగపిల్లలు గూడాను. చంటివాడికిప్పుడు రెండేళ్ళుంటాయి.

ఆయనకింకా రెండు మేడలున్నాయి. వాటిని అద్దెలకిచ్చుకుని తానీడాబాలో వుంటున్నాడు. ఒక పెద్ద గుడ్డలకొట్టుగూడా వుందట. ఆయన ఇంటినుంచి ఎప్పుడు వెళ్తాడో, ఎప్పుడు తిరిగి వస్తాడో? నిజానికి ఆయన ప్రక్కనే కాపురం యీడుస్తున్న నాకే తెలియదు. సరిగ్గా నేను కవితా సామాగ్రితో సమాధిలో దిగబోయే వేళకు మాత్రం యీ సందడి సాగేది. "ఏఁ! ఇవాళన్నా యిటు తగలడేదుందా?" అనే ప్రారంభ వాక్యాలతో –

మా యింటికి ఆనుకొనే, యివతలవైపు ఖాళీ చోట్లో ఓ పూరిపాకవుంది. చాలా చిన్నది. చుట్టూ

మేదరితడికలు. అందులోనూ మొగుడూ, పెళ్ళాం, ముగ్గురు పిల్లలూ వుంటున్నారు.

అతను పల్లెటూరివాడు. మొదట్లో బాగా బ్రతికిన సంసారమట. రాగా రాగా ఉన్న కాస్తా కొండ్ర తోనూ బ్రతక లేక కౌలుపొలాలు చేశాడట. దండగలు తిన్నాడట. కొండనాలుకకి పెడితే ఉన్న నాలుక ఊడినట్టు ఋణాలక్రింద ఉన్నదికాస్తా వూడ్చుకుపోయిందట. ఉన్న వూళ్ళో కూలి చేసుకునేందుకు మొగం చెల్లలేదట. బస్తీకిచేరి బండిలాక్కుంటున్నాడు.

వాళ్ళది అదోరకం సంసారం. యిద్దరూ యీడూ జోడూ వయస్సులో వున్నారు.

పొద్దుగూకులూ లాగుడుబండితో సతమతమై వచ్చేవాడు భర్త. యిద్దరూ దీపందగ్గర చేరేవాళ్ళు. ఆవేళటి ఆదాయాన్ని లెక్కచూసుకునేవాళ్ళు. మరునాటి ఖర్చు బడ్జట్ వేసేవాళ్ళు. ఆతర్వాత నీళ్ళుకోసి పిప్పతో మేది పెళ్లాం. పిల్లల్ని దగ్గరకూచోబెట్టుకుని ఆ వున్న దేదో తిని మూతి తుడుచుకునేవాళ్ళు. కాసేపు పిల్లలతో ఆడుకునేవాళ్ళు. పిల్లలు నిద్రబోయింతర్వాత సంసారపు గొడవలూ అవీ గుసగుసలాడేవాళ్ళు. రేపటి బ్రతుకు ఆలోచనల్తో నిద్రబోయేవాళ్ళు.

♦ ♦ ♦

నలుభై నాలుగు

షావుకారుగారి పెద్దపిల్లవాడు పుట్లు, వెర సులూ చదువుకొంటున్నాడు. మిగతా యిద్దరుపిల్లలూ యింటిదగ్గరే ఎప్పుడూ బిస్కెత్తులూ, పంచదారబిళ్లలూ, అరటికాయలూ ఒకటేమిటి? వాళ్లు కావాలనుకున్నవన్నీ జేబుల్లో కుక్కుకునేవాళ్లు. ఒక్కొక్కటే తీసి పొరుగు పిల్లల్ని వూరిస్తూ తింటూండేవాళ్ళు.

ఇంట్లోనించి వాళ్లమ్మ "ఓరి వెధవల్లారా! ఎవళ్ళకళ్లు ఎలాంటివో! యింట్లోకి చావరేం?" అని ఒక్క కేక పెట్టేది. ఎక్కడపిల్లలక్కడ గప్‌చుప్... అసలాబజార్లో మాకు దగ్గరగా పిల్లలున్నది యీ రెండిళ్ళ లోనే.

షావుకారిగారి పిల్లలు గాలిపటాలు ఎగర వేశేవాళ్ళు. రైళ్లు, కార్లు, పోలీసులు రకరకాల బొమ్మలు తెచ్చి బజార్లో దుకాణం తెరిచేవాళ్లు. ఆట సాగించే వాళ్లు పాపం ఆపూరింటిపిల్లలుకూడ వచ్చి కూర్చునే వాళ్లు. వాళ్ళకున్కూడా వాటిని తాకిచూడాలామనిపించేది. కాని అంటుకోనిచ్చేవాళ్లుగాదు.

"ఓరేయ్ - మీకుకాదురా చెప్పేది? వాళ్లు దొంగవెధవలు. ఎత్తుకుపోతారు. ఇంట్లోకి చావరేం." అని గద్దించేది వాళ్ళమ్మ. అసలే ఘనకాయంనుంచి వచ్చే కేక; ఆపైన డాబా ప్రతిధ్వని. పేటపేటా దద్దరిల్లేది.

"రండి. నాయనా! యిక్కడాడుకుందురు

గాని—'' అని పిల్లల్ని తీసుకుపోయేది పూరింటావిడ. ఏమామిడి టెంక గానుగో, మట్టిబొంగరమో చేసియిచ్చేది. 'ఎంతచెట్టు కంతేగాలి' కదూ. కాని పిల్లలికి యీ వేదాంతం బోధపడేదికాదు.

రోజులాగానే పూరింటావిడ 'పున్నాగపూలు ఏరుకోవటానికని' డాబా వెనకదొడ్లోకి వెళ్లింది. డాబాయింటావిడ జలకమాడుతోంది. కొద్దిపాటి గున్నమామిడిలా కూర్చొని—

''ఏం? అన్నీ అగపడుకుంటూ ఆకోక కట్టుకున్నావేం?'' అన్నది.

ఒక్కసారి చిరుగుల కోకవంక చూసుకొని ''పొట్టకే చాలటంలేదు. యింకా బట్టకేమొస్తదీ?'' అన్నది పూరింటావిడ.

''అట్టాంటి మొగుడితో కాపరం చెయ్యక పోతే యేం?'' అన్నది ఆభాగ్యశాలి.

''ఎట్టాంటి మొగుడితో చెయ్యాలి''? అనలేకపోయింది ఆ పేదరాలు.

''మా ఆయనచూడు ఎలాంటి కోకలు తెస్తాడో'' అన్నది ఆ లావాంటి శరీరం.

''ఐతే మీ ఆయన్ని పెట్టుకొని వుండమంటావా?'' అన్నట్లయితే ఆ చువ్వలాంటి అమ్మాయి...

''ఆఁ! ఆ! అదే అదే-'' అనేది ఆ విలువైన యిల్లాలు.

కాని మొదలకుండా వ్రాసుకొంది. యీ తేలిక పిల్ల-పేదతనమంటే ఏమిటే? గడ్డిపోచకంటే తేలిక.

''నేను నీకు మంచికోకలు దొరికే ఉపాయం చెప్పేదీ?'' అడిగింది ఆ చిన్న తలకాయ (ఆశరీరానికి మాత్రమే)

పాపం చిన్నబుచ్చుకొని గిరున తిరిగి వెళ్లిపోయిందా యమ్మాయి.

ఆ సాయంత్రమే డాబా వాకిటికి సరిపోనూ కూర్చొని చెరిగిపోస్తోంది ఆ యిల్లాలు.

పూరింటావిడ రోడ్డుమీద నుంచున్నది. నెత్తురు కార్తోన్న పిల్లవాణ్ణి ముందు బెట్టుకొని.

''చూడండి! రాయిబెట్టి ఎట్లా కొట్టాడో.''

''కొడితే తిరుగురాయిబెట్టి మా అబ్బాయిని కొడతానంటావా''

''కొట్టేమాత్రపు వాళ్లైతే మాగతెందుకిల్లా వుంటది?''

''అబ్బో! మీ ఆయనేగంగ సంపాయించి పోస్తున్నాడనా?''

''సంపాయించే మాత్రపు వాడైతే.''

"ఆడు సంపాయించకపోతే నీవుబయట్దేరూ. చక్కటి చుక్కేగా ?"

"...................."

"పిల్లలు కొట్టుకున్నారంట. అడగొచ్చింది. తానేగాగా కన్నది ఓ కోతిని." దులిపేసింది డాబాయింటావిడ_

"ఎవరిపిల్లలు వాళ్లకే ముద్దు" పాకాలో దూరిందా యమ్మాయి.

చుట్టూ పది కొంపలలోనుంచి పదికిపైగానే బయటికొచ్చారు.

"చింత చచ్చినా పులుసు చావలేదు"

"అసలిట్టాంటి రకాన్ని చేరనియ్యటమేతప్పు."

"కూటికి లేనిదానికి నీటెందుకో_"

"ఎత్తొచ్చినముండ దానికేం ? ఇరవైఆరంటది."

"నీకెందుకు నీవు పోవమ్మా తల్లి. నీకేమైనా తిట్లయినా చాత్తైతే అనుకోవచ్చు."

"ఇదుగో రేపుచెపుతా దీనిపని. ఆచోటెవడి దనుకొందో." అలాగే వీధివీధంతా మోతలెత్తించింది. ప్రొద్దుకూకింది. పూరిపాకలో_

"నలిగున్నమ్మా తొలిగుండమనీ-కాలం. పోనీ అట్లానే."

"రేపు యిక్కణ్ణించి వెళ్లగొట్టిస్తదట."

"హాఁశీ! యిందుకేనా ఏడ్వటం? పుట్టి పెరిగినగడ్డే పోయింది. యికయిదా? ఉన్నమ్మకొక ఓవ్వాను. అడుక్కుతినే దానికి అర వైఅరూళ్లు. దీనికేనా? మనమేం ఎవరినోళ్లు కొట్టడంలా. చాకిరి చేస్తున్నాం బ్రతుకుతున్నాం."

ప్రొద్దుపోయింది. డాబాలో-

"మరి యివాళన్నా..." అడిగాడు మొగుడు,

"ముదనష్టపుగోల - రోజూ ఒకటేగోల" అన్నది పెళ్లాం.

"గోల లేకుండా చెయ్యరాదూ?" అడిగాడు మొగుడు.

"అందుకే. మొలలోతు గోలయింది." చెప్పింది పెళ్లాం.

"ఏమిటీ!?... యిటరా-యిట్రా."

"..............."

---

# ప్రజా సేవ

ఆ గ్రామంమీదకూడా—"దాడిజరుగుతుంది" అనే పుకార్లు ప్రబలంగా వ్యాపించుతున్నాయి. కొంత మంది— "యిదంతా అనవసర ఆందోళన" అని తేలిగ్గా కొట్టిపారేస్తున్నారు. "షావుకారు నారయ్య వగైరా పది మందిదాకా ప్రజలు ఆ గ్రామంలోకూడా వున్నారు గనుక, ఆ పదిమంది ప్రజల రక్షణకోసరం దాడి జరగక తప్పదు" అని సహేతుకంగా నిరూపిస్తున్నారు. మరికొంత మంది—

ప్రజానాయకుడు షావుకారు నారయ్యగారు కూడా యీపై విషయాన్నే ధృవపరిచాడు. "అనవసర భయం అనవసరం" అని ప్రకటించాడు. "ఐతే అదీ ప్రజలైనవాళ్లకు మాత్రమే" అని ఓసరతు పెట్టాడు. అసెంబ్లీలోని ప్రశ్నోత్తరాల ఆధారాన్ని చూపుతూ— షావుకారు నారయ్య వారంటే...

'వారి వారి తాతముత్తాతల కాలంనించీ కూడా కరక్తో ఆగ్రహాన్ని సరిచేసుకుంటూ వచ్చిన వారుగనుకా; కాంగ్రెస్ హయాంలో సైతం ఎలాంటి సత్యాగ్రహాలకూ పాల్పడకుండా ఆగ్రహాన్ని కాపాడు కుంటూ వచ్చినవారు గనుకా; తన జీవితం 'హక్కీ' అనే

యాభై

వరకూ ఆవూరిమీద మమకారం పోయేట్టులేదుగనుకా; ఆ-తన స్వగ్రామాన్ని దాడినుంచి తప్పించదలచుకున్న వాడై, ఆ గ్రామస్థుల సందర్శి ప్రజల్లో చేరిపోవలసిందని సలహా యిచ్చాడు. కొంచం కష్టకార్యమే ఐనా తాను అందుకు సర్వసహాయాలూ చెయ్యగలనని హామీ యిచ్చాడు కూడాను.

నిజానికి బ్రిటిష్ ప్రభుత్వంక్రిందకూడా ఆగ్రామస్థులు ప్రజలుగానే వున్నారు. కాని మరీ ఒక సంవత్సర కాలంనుంచే వాళ్లు 'ప్రజ' అంతస్థునించి దిగజారిపోయి నట్టు స్పష్టమయింది. స్పష్టంకావడం ఈ ఏడాదిలోనే ఐనప్పటికీ, వీళ్ల 'ప్రజాత్వపతనం ప్రారంభంకావడం మాత్రం యుద్ధ కాలంలోనే' అన్న విషయం చారిత్రక పరిశీలనవల్ల తేలింది.

యుద్ధ కాలంలో 'కరువు' కంట్రోళ్లు, బ్లాక్ మార్కెట్ బానిసత్వం, అంటూ గొనగడం మొదలెట్టి-షాహుకార్లను దోచుకు తినాలనే స్వార్థంతో సమ్మెలు కట్టి, పరానికి దూరమై, 'తిండిగుడ్డ' అనే ఐహికవ్యూబిలో దిగి, అటుజారి యిటుజారి పుటుక్కున ప్రజలేకాకుండా పోయారు.

ఎటుతిరిగీ ఆ గ్రామంం మొత్తంలో పతనానికి గురికాకుండా నిలబడిందల్లా షాహుకారు నాగయ్య, వారి అనుచరులు యింకో పదిమంది మాత్రమే-

అన్ని ఆటుపోటుల్లోనూ అచంచలంగా నిలబడగల ధీరులు యీ ప్రపంచంలో చాలా కొద్దిమందే వుంటారు. ఆకొద్దిమందిలోనూ నారయ్యగారు ఒకడూ.

ఐతే యీ విషయంలో అభిప్రాయభేదంకూడా వున్నమాట సత్యం. అదేమంటే "మొన్నటిదాకా జస్టిస్ పార్టీలోవున్న నారయ్యగారు - కాంగ్రెస్ అధికారంలోకి రాగానే అమాంతం కాంగ్రెస్ ఐపొయ్యాడుగదా--" అని

అది- ''ఏ యెండకు ఆగొడుగు పట్టడం''-అనీ

ఇలా అనేవాళ్లు జనాభా లెక్కలో అధిక సంఖ్యాకులే ఐనప్పటికీ, వాళ్లంతాకూడా ప్రజాత్వాన్ని కోల్పోయిన పామరులే కావడంవల్ల-;

-'ఏయెండకాగొడుగు' అన్నపదం-నింద్యగ్రామ్యం ఐపోయింది. పోతే-''కాలానుగుణ్యం'' అనే ఆపద్ధర్మ సూత్రప్రకారం నారయ్యగారు అమాంతం కాంగ్రెస్ అవడం ఆక్షేపణీయంకాదు గనుక ఆ భేదాభిప్రాయం నిరాధారమై వూరుకున్నది.

ఏతావతా అసలు విషయం ఏమిటంటే-

'ప్రజల్లో చేరండి' అన్న నారయ్యగారిసలహా అక్కడివాళ్లకు ఆసాంతంగా నచ్చకపోయినా ఆలోచనలోమాత్రం పెట్టింది.

తెలివిగలవాళ్లు ఎటూ తెలివిగలవాళ్లే గనుక, కుతర్కాలకు పోక కొంతమంది వెంటనే పావలాపారేసి

ప్రజాత్వం కొనుక్కున్నారు. అంతకుపూర్వం, ఎన్నికలు పదవులుకోసం సంతకాలతో సైతం నిమిత్తంలేకుండా లభ్యమయ్యే సభ్యత్వం రానురాను ధరపెరిగి, చివరివాళ్లు బ్లాక్ మార్కెట్టులో ప్రజాత్వాన్ని కొనబోయేసరికి వందలూ, వేలూ, అయి ప్రామిసరీనోట్లుకూడా వ్రాయాల్సివచ్చింది. మరీ మొద్దు రకానికి దేహశుద్ధి చేస్తేనేగాని ప్రజాత్వం తరాని ఘటనలుకూడా వున్నాయి. ఐనా-యింకా కొందరు 'ప్రజాత్వం' సంపాదించాలనే తహతహకూడా లేని ద్రోహులు సైతం కొద్దిమంది మిగిలిపోయారు.

'యీ నూతనంగా ప్రజాత్వం పుచ్చుకున్నవాళ్లలో ప్రజాత్వం ఎంతవరకూ నిల్చింది? సర్వ కష్టాలలోనూ యీ అమూల్య వస్తువును నిబ్బరంగా నిలబెట్టుకోగల శక్తి సంపన్నులయ్యారా? లేదా?' అన్న సందేహాలు నారయ్యగార్ని యింకా పీడిస్తూనే వున్నాయి. అందుచేత-

భగవంతుడు-భక్తులను బాధించి బాధించి పరీక్షించడం భారత సాంప్రదాయం కాబట్టీ; శ్రీరామచంద్రమూర్తి స్వజనంలోనిదైన సీతను అగ్నిపరీక్షకు గురిచేయడం సోదాహరణంగా కనిపిస్తున్నది కాబట్టీ; యిక తాను పరజనాన్ని పరీక్షకు నిలబెట్టడం ఏమంత కష్టం కూడా కాదుకాబట్టిన్నీ ఆగ్రామస్తుల ప్రజాత్వాన్ని పరీ

క్షించడానికి తానే స్వయంగా పూనుకున్నాను.

'దేశ సౌభాగ్యంకోసరం ఎక్కువపని-తక్కువ కూలి' నినాదం యిచ్చాడు.

నూతన ప్రజలు-తమ ప్రజాస్వామ్యతను చాటుకోడానికి ముక్కుతోనో మూలుగుతోనో చేశారు. ప్రథమ పరీక్షకు తట్టుకుని నిలబడ్డారు.

షావుకారు నారయ్యగారుకూడా యీ నినాదంవల్ల తనకుగలిగిన లాభాన్ని అంకెల్లో అంచనా కట్టాడు. దేశమంటే తానుకూడా గనుకనూ, తన సౌభాగ్యం దేశ సౌభాగ్యమే గనుకనూ విశ్వవ్యాపిత దృష్టితో సంతుష్టిపడ్డాడు.

దేశీయ ఆర్థికాభివృద్ధికోసం 'తక్కువ జీతం-ఎక్కువ పన్నులు' అన్నాడు యీసారి.

యీసారికూడా ఏదో కొద్దిమంది మినహా చాలావరకూ మధ్యమ శ్రేణిలోనున్నారు.

యీ ఉత్సాహంలో- 'జాతీయ పుష్టికోసరం, ఆత్మ నిగ్రహశక్తి కోసరం, ఒళ్లుబలిసి తప్పుదారులు తొక్కకుండా ఉండేందుకోసరం, వారంరోజులు నిరసన వ్రతం-మామూలుపని' అన్ననినాదం యిచ్చాడు. (తిండీ ఎలాగూ తినడంలేదుగనుక జీతాలు అనవసరం అన్నది సువిదితమే.) అదంతా దేశీయ ఆర్థికాభివృద్ధ్యర్థం తన ఖజానాలో జమ కట్టించదలచుకున్నాడుకూడా.

కాని ఈ తఫా ఒక్కళ్లుకూడా పరీక్షలో నిల బడలేదు. నూతనంగా వచ్చిన ప్రిజాత్వంకాస్తా ఈ దెబ్బతో దిగిపోయింది.

యిక నారయ్యగారు 'మర్దనం గుణవర్ధయేత్' అన్న ధర్మసూత్రాన్ని తలచుకున్నవాడై, పరోపకా రార్థం యిదం శరీరం అన్నారుగనుక- అంతలావు శరీరం ఆయాసపడుతుందన్నైనా చూడకుండా హుటాహుటి వెళ్లి పోయాడు. చట్టబద్ధులైన ప్రజారక్షకుల దగ్గరికి-

'సామదాన భేదోపాయాలు సర్వం ఐపోయా యనీ, 'చతురోపాయమైన దండోపాయం మాత్రమే మిగిలివుంద'నీ సవినయంగా విన్నవించుకున్నాడు. ప్రిజా త్వాన్ని స్థాపించవలసిన అవసరాన్ని మొరబెట్టుకున్నాడు.

ప్రజా రక్షకులుకూడా దండోపాయమే తమ ధర్మంగనుకా, అందుకే తాము వున్నారుగనుకా తక్ష ణమే సిద్ధపడ్డారు. దిగిదిగడమే యింటింటా జొరబడ్డారు... ఏకజండా, ఏకపార్టీ, అంతా ఏకత్వానికే ప్రాధాన్యంగల కాలంగనుక-యిళ్లల్లోని బియ్యం, పెసలూ, పచ్చళ్లూ సర్వమూ కలిపి వివిధ వస్తువుల ఏకత్వం ఏలా సాధ్యమో నిరూపించారు. అంతేగాకుండా ద్రవ, ఘన, పదార్థాల ఏకత్వంకూడా 'సుసాధ్యం' అని నిరూపించడానికి కిరోసిన్ సైతం కలిపి మిళితం చేశారు.

కొంతమంది ప్రజాపతనానికి నాయకులైన

వాళ్లయిళ్లు కుట్రపన్నడానికి స్థావరాలయ్యే అవకాశం వుంది కాబట్టి-అలాంటి యిళ్లను ప్రజాపతి నారయ్యగారి సలహా సంప్రదింపులపై కొన్నింటిని పీకీ, మరీ ప్రధానమైన వాటిని దహనసంస్కారం గావించీ వదిలారు. ఇలా అనేకవిధాల షాహుకారుగారిని సంతుష్టిపరచి, సర్వం చక్కపరచి మరీ చక్కాబోయారు.

మర్నాడు ఉదయానికి తేలిన అనధికార అభిజ్ఞ వర్గాల అంచనాలప్రకారం ఒక యింట్లో కామ్రేడ్ కోడిగుడ్డూ, మరోచోట కామ్రేడ్ కాసులపేరూ, యింకా కామ్రేడ్స్ మేకపోతూ, మనీపర్సూ వగైరా వగైరాల అరెస్టులు జరిగాయని తేలింది.

యింకో ధృవపడిన వార్త ప్రకారం-ప్రజాత్వం కోల్పోయిన వాళ్లతోబాటు పాతప్రజలకు్కూడా పల్చపల్చగా దండప్రయోగం జరిగినట్టుతేల్తోంది. అందుకు కారణం ప్రజారక్షకులు బహుశా 'అధికస్య అధికంఫలం' అని భావించి, ప్రజాత్వం అసలు ప్రజల్లోకూడా అధికం కావడానికి అలాచేసి వుంటారని ఊహించబడుతోంది.

ఇంతకూ పునర్నిర్మాణానికి ప్రజాపతి నారయ్యగారు గావించిన యీ అంతిమ ప్రయత్నంవల్ల కలిగిన ఫలితం యేమంటే-పాత ప్రజలుగావున్న పదిమందిలోనూ-కొంతమందికి తలలుపగిలి ఆగాయాలవల్ల కారిన నెత్తురు, కన్నీళ్లతోపాటుగా ప్రజాత్వపు నిషాకాస్తా దిగిపోయి

వూరుకున్నది.

మొత్తంమీద ఆ గ్రామం సర్వస్వం బ్రిటిష్ ప్రభుత్వ హయాంలోని కాంగ్రెస్‌వాళ్లలాగా, యీనాడూ మలయా, బర్మాలలోలాగా అంతా దుండగీంద్రమయమై పోయింది. ఇక యీనాడు ఆ గ్రామంలో మిగిలిన 'ప్రజ'అల్లా నారయ్యగారు ఒకే ఒకడు అయిపోయాడు.

ఐతే నారయ్యగారు ధీరోదాత్తులు గనుక, చింతాక్రాంతులు కావడానికిమారుగా ఆగ్రహావేశులై – ఆముదం తాగేవాడిలా మొహంపెట్టి "వెధవలు. పులుపు గబ్బు వెధవలు. ఈ వెధవలకు ప్రజాత్వం తెప్పించడం ఎవడికక్కర్లేవాలి. ఈ వెధవాయిలకోసరం ఎగిరిన ఎగుడంతా ఏ పర్మిట్‌కోసరమన్నా ఎగిరివుండాల్సింది." అంటూ రాజవీధులనుంచి నిష్క్రమించినవాడై – దుండగీండ్ర మధ్య 'ప్రజ' ఐన ఒకే ఒక తాను వుండటం ఆత్మగౌరవానికి అట్టే మంచిదికాదు గనక ఒకనాటిరాత్రి అమాంతం స్వకుటుంబ సపరివారసమేతంగా అంతర్ధానమై వూరుకున్నాడు.

నీతి :— ఇది ప్రజాయుగం.

ఫలశ్రుతి :— ఇంతవరకూ 'ప్రజలు, ప్రజ' అన్న పదాలు నిత్య బహువచనాలుగానేవుండిపోయ్యాయి. ఇక విశ్వసాహిత్యంలో పై పదాలకు ఏకవచనరూపం ఏర్పడే అవకాశంకలగడం శుభసూచకం.

# సమ్మె పిలుపు

నాలుగు రోజులనుంచి, వరుసాగ్గా, ముసురు పట్టి నేలంతా చితచితలాడిపోతోంది. ఆ జారుడులో భద్రంగా కాలుదీసి కాలుపెడుతూ నడుస్తోంది ఎర్రి. తైల సంస్కారం లేక ఔరుదుబ్బులా రేగినతల, ఎడమ చంకలో తట్ట, తట్టలోనుంచి పైకి తొంగిచూస్తోన్న చీపురు, కుడిసందిట్లో వీపుమీదుగా కట్టుకున్న అడ్డాలలో బిడ్డ, కుడిచేతిలో చిన్న బొక్కెన-పైగా నిండు గర్భిణీకూడా నాయె. నడవలేక నడవలేక నడుస్తోంది. అచ్చంగా పెద్ద గడ్డిబండిలాగా కన్పడ్డది. ఆ తెల్లవారగట్ల మసకచీకట్లో—

బయల్దేరడం అయితే అందరితోపాటే బయల్దేరింది. కాని - ఆవూర్రి బైట మాగాణి పొలాల్లోంచి మస్తరు వేసుకునే చోటికి ఆ సరంజామానూ, ఆ మాత్రపు దేహాన్ని యీడ్చుకొచ్చేసరికి అన్నీ ఐపోయినాయి. తాను పనిలో ప్రవేశించినాక ఏ నెలా పూర్తి జీతం తీసుకోనేలేదు. మరీ క్రిందటి నెల జీతమంతా జరిమానాలక్రిందే పోయింది.

"ఏడు తిరగమారకతలికే పాపిట్టి కడుపొత్తంటే ఎట్టాసచ్చేట్టురా బగమంతుడా'' అనుకుంటూ మేస్త్రీ ఎదురుగుండా నిలబడింది.

యాభైయెనిమిది

భారతదేశం సంతానానికి ప్రఖ్యాతమనీ, అలాంటి సంతాన భాగ్యాన్ని అలా అనుకోడం ఘోర తప్పిదమనీ, పాపం! ఆపాకీపని చేసుకునే దానికేం తెలుస్తుంది?

"చంకనోపిల్ల-కడుపులోపిల్ల - పో! త్వరగా పో!" అన్నాడు మేస్త్రి.

ఆ గొడ్డుమోతు మేస్త్రి చూపుల్తోనే తన సంతానాన్ని మింగుతున్నాడా! అనిపించింది ఎర్రికి—

"బిడ్డదానికి నాలుగునాళ్లనుంచీ కాక తగుల్తుండాదండీ" అన్నది ఎర్రి-

చీదరగా వొకసారిచూచి "సరేలే పో!" అన్నాడు మేస్త్రి.

ఎర్రి వెనక్కుతిరిగింది. అసలు ఆ మిడిగ్రుడ్ల మేస్త్రీనిచూస్తేనే తనకు భయం. ఏంమాట్టాడేటట్టు?

తట్టలో ఆకులు లేవు. ఎత్తి తట్టలోవేసే అసహ్యమంతా యిక ఎర్రిమీదే వుంటది.

"ఓపలేనిమడిసిని. ఒంగుతా లేత్తా అర్థనై దొడ్లు చేసేదెట్టా?" అనుకుంటూ కాలు కొంచం సాచివేస్తూ పోతోంది.

రోడ్డుమీద పెంచలగాడు కర్రచీపురు బుజాని

కానించుకుని, ఏరుకున్న బీడీలను చిరుగులపంచలో చుట్టి రొంటిని దోపుతున్నాడు.

"ఇంత యాలకైత్తే యాడన్నా యెంగిలాకు లుంటయ్యా? బేగిపా. పెద్దగాడిదకొడుకేం జేత్తుండను. గుడిసె లోపటజేరి కప్పకాళ్ళకి తాళ్లుపోసి ఆడుకోపొతే యిట సావబెట్టకపోయా?" అన్నాడు.

ఎర్రి కొంచం కాలు జాడించింది. ఏహోటలు దగ్గర చూచినా వట్టి ఆకులే.

"దొంగ నంజలు. అప్పుడే తుడుసుకు పోయుంఁడ్రు." అంటూ హోటలు హోటలుకూ తిరిగింది.

చివర కొకసందులో హోటలు గోడక్రింద, గంజిగుంట ప్రక్కగా ఆకులకుప్ప కనపడ్డగి. ఏముంది? ఒకటి రెండు ఆకుల్లో అల్లపు పచ్చడితప్ప- ఎర్రిలాంటివే ఏకుక్కలో నాకివేసి పోయాయి.

"హుం! యీ రేసనింగురోజుల్లో మెతుకు లేదుంటాయి. కుక్కలే అల్లాడిపోతుంటేని—" అనుకుని పచ్చడి తీసి నాలుకను వ్రాసుకుంటూ మిగతా పచ్చడి బొక్కెనలోనూ, ఆకులుతట్టలోనూ వేసుకుని బయలు దేరింది.

ఆవేళ దొడ్లన్నీ పూర్తయేసరికి ప్రొద్దు నెత్తిమీది కొచ్చింది. రోజూ అలవాటే ఐనా ఆ రోజు మురుగుడు మూలానో యేమో! ముక్కలు బద్దలు

కొట్టుకు పోయాయి. దారిలోనే తలబద్దలు కొట్టుకుపో వడం సాగింది.

"తొలింబరంగా సెలవెట్టితే మలిదినాల్లో కట్టం. ఆ సెలవ రోజుల్లోనన్నా బుడ్డాణ్ణియేత్తే సరిపోతది. దానికి ఆపీసరుగోరికి పది రూపాయలు ముందు కట్టుకో వాలె. వచ్చేపది అట్టాపోతే—"

గుడిసెలోకి పోయిచూస్తే ఎవరూ లేరు. ఒక మూల గోనెపట్టామీద మునగదీసుకుని పడున్నాడు మామ కుష్ఠురోగంతో.

మామ కాళ్లూ, చేతులూ చూస్తే ఆవేళ ఎందుకనో భయంవేసింది. తన చేతులూ కాళ్లూ అలానే అవుతాయి. ఈరోజు తన చేతుల్తో తాను అన్నందినే రాతలేదు. ఇంట్లో ఎవ్వరూలేరు. పిల్ల ఎటో ఆడటానికి పోయింది. పెద్ద బుడ్డాడు సరేసరి. మొగుడు 'పెంచలు' ఎటుబొయ్యాడో? బొంగునజూస్తే బుట్టలేదు.

"పీతల పటాకి పోయుంటు:గామాలు. తెల్లా రింది మొదలేసుకుని పను కుంగిందాక పొట్ట దేవులాటకే సరిపాయె."

చంకలోనే నిద్రబోయిన బిడ్డని ఒకప్రక్కని పడేసి ఆగుడిసే ఆగుడిసే తిరిగి ఓ అమ్మను పట్టుకొచ్చింది. "రాయే! యీయాల్లింత కూడుతినిపిద్దుగాని-యీ సేతుల్తో తిన రోతేత్తాందది" అని—

"యీమూండ దిందిట్టో - యియిగో" కుండ ప్పైకెత్తి చూపించిందా యమ్మ.

"ఉండకాసింతా పెద్దగున్న దిని ఏగుట్టలగో సచ్చిందు. ఆటలకి___"

ఆ కాసిని మెతుకుల్లోనూ తాను తెచ్చుకున్న అల్లపు పచ్చడి కలిపి యింత నోట్లో వేయించుకున్నది.

ఆ సాయంత్రం "నాగాపడితే ఆసిర్లే" అని పోలేక అల్లాగే గుడిసెలో పడుంది. పెంచెలుమాత్రిం బుట్ట గుడిసెలో పారేసి డ్యూటీకెళ్ళాడు. ప్రొద్దుకూకే వేళకు తిరిగివచ్చాడు.

పీలికలు పీలికలుగా వ్రేలుకాడుతోన్న ఆ చేతు ల్లేని నల్లచొక్కా-మీాద ఎర్రటి చీటివుంది.

"ఓలయ్యో! తెల్లారితే సమ్మె." ఆచీటీ రోజూ చూస్తూనేవుంది ఎర్రి. కాని యీవేళ ఎందుకనో గాబరాపడ్డది. తాను రేపోమాాపట్లో ప్రసవించ బోతోంది. ఎంతలేదన్నా ఐదురూపాయలుఖర్చు. ఆ పాడు గుడిసెకే అద్దెకూడా కట్టాలి. క్రిందటి నెలజీతమంతా కోతలక్రిందే పోయింది. జీతంమాత్రిం ఎంతజీతం? తొమ్మిదిరూపాయలు;కరువుదో పదారు; మొత్తం పాతిక-తన జీతంగూడా కలిపి, అన్నీ సరిగ్గావస్తే యాభై. ముస లాడు, తాను, పెంచలు, ముగ్గురు పిల్లలు, ఏమూలకి యీ కరువురోజుల్లో. ఇప్పుడు సమ్మెజేస్తే ఎట్లా? పోయి

ఖాతాదారు కోనప్పకాళ్ళమీద పడాలి.

కోనప్ప జ్ఞాపకంవచ్చేటప్పటికి కొయ్యబారి పోయింది ఎర్రి. క్రిందటి నెల వాడిదగ్గరతీసుకున్నది 10 రూపాయలు-రూపాయికి బేడా కాడికి పదిబేడలు రూపాయి పావలా నెలచెల్లేసరికి ముందుగానే జీతంలో తీసుకుంటాడు. "అమ్మయ్యో!" మొగుడికి దగ్గరగావచ్చి "ఒరేమామ! నువ్వుగూడా సమ్మెకడతవుర?"

"ఓ! కట్టక — తప్పాదియ్య! పాత్రికేళ్ళ మట్టి పనిజేత్తావుంటే యేటికి రూపాయికాడికన్నా పెంచక పోతే!"

"సమ్మెసెయ్యమాకరా! నేను రేపోమాపో నీల్లాడుతాను."

"ఓయ్! నీల్లాడు - పోల్లాడు. సమ్మెచేసి చూపిత్తా."

"అదిగాదురా. కడ్జు సూసుకుండావా?"

"తాలుండిక. లెక్కాని నలబై దొడ్లలంట; శెయ్యబోతే ఎనబైదొడ్లు. సత్తావుంటేను-"

"ఇనిపిచ్చుకో కొత్త-పని వూడుద్ది-"

"సీతాత తల్లోపేను దిగిరావాల. తెల్సా?"

"ఆ - ఎవుడో ఒకడు అంటులో యిరుక్కుంటే—"

"ఓడాయిరుక్కునేది? కడుపున కనుకున్న

బిడ్డకి చెయ్యడానికే తల్లి ఎరుసుద్దే. అట్టాంటిది మనం మట్టిదిని యేలకుయేలు చేత్తావుంటే-ఓడే ఆ కనికారంలేని యదవ నాయాలు."

"కోటప్పగాడిపని సూశావా? ఏమైందో-పని లేక తిరుగుతుండాడు. సేతులో డబ్బున్నావుంటే—"

"అందుకే - యీడాదికి నెలజీతం బోణాసు రావాల. సరైన పనిముట్లూ యియ్యాల..."

(తాగున్నాడేమోనని మొదలకుండా పోయింది ఎర్రి.

"చూసుకో. యీదెబ్బతో —! పెద్దపెద్దోరంతా జీతాలు పెంచుకోడమున్నా—"

సమ్మె నోటీ సివ్వడానికి పోయినరోజున తాను కూడా ఊరేగింపులో వెళ్లింది ఎర్రి. సంఘం పెట్టుకున్న తర్వాత మేస్త్రీల మామూళ్లు, ఆఫీసరుగారింట్లో అరవ చాకిరీ, తప్పిపోయిందన్న సంగతి మరచిపోలేదు. కాని... రాబోయే ప్రమాదాన్ని కొండలా తలచుకొంటూంటే-యిప్పుడవన్నీ అంతగా పనిచెయ్యడంలేదు. ఆ రాత్రల్లా ఆలోచనల్తోనే నిద్రబోయింది. మర్నాడు ఉదయం ఆలస్యంగా నిద్రలేచింది.

అప్పటికప్పుడే-పెంచలు నేదరబుట్ట తీశాడు. పెళ్లినాటి బట్టలు కాలవకట్టమీద బుడబుక్కలవాళ్ల దగ్గర కొన్నవి తీసికట్టాడు. బయల్దేరబోతున్నాడు.

గభాలునవచ్చి కావిలేసుకొంది ఎర్రి.

"ఉండాశే. పిచ్చిముండ! పంటసేను వొదిలి పరిగ యేరుకుంటావంట. సమ్మె నాలుగురోజుల కట్టానికి జడిసి, సచ్చిందాకా కట్టపడమంటావంటే. లే! వొదులు. నేనొక్కణ్ణేనంటే – వొదులు." అని విదిలించుకుని గుడిసెలోనుంచి బయటబడ్డాడు. చంటిదాన్నెత్తుకుని తానూ బయటికి వచ్చింది.

గూడెంకు తూర్పు పక్కగా మామిడితోపులో సూర్యుడు వుదయిస్తూ అందంగా ఎర్రిగావుంది.

రండోయ్! రండోయ్! పేదల్లారా!
పోరాడ్దాం మన హక్కులకై

......................

పోయే దేముందోయ్ మనకింకా
పోతే యీ పేదరికమెనోయ్!

......................

ఉక్కుముక్కలుగ ఒక్కుమ్మడిగా
పోదాం రండోయ్ పేదల్లారా!

రంయ్యిన ఆ అన్నిరకాల గొంతులూ ఒక్కసారిగా మోగాయి ఒక్కటిగా.

ఎర్రిఅలాచూస్తూనే ఆగుంపుతో వెళ్లిపోతోంది.

గుడిసెలో పడున్న మామ చెవుల్లోసైతం అదే ధ్వని గింగిరెత్తుతూవుంది.

—

# నక్క తీర్పు

అది గ్రామమో, పట్టణమో, రాజ్యమో, చెప్పడం చాలాకష్టం. కాబట్టి - అనగా అనగా అదేదో అనుకుందాం. అది ఏమైతే యేంగాని దానికి రాజంతటి వాడుగా శ్రీ శ్రీరాములుంగారుమాత్రం వున్నాడు. అక్కడి ప్రజలకంతా ఒకప్పుడు దేవుడి తర్వాత దేవుడంతటివాడు. ఇప్పుడు నాయకుడుగా చెల్లుబాటౌతున్నాడు. ఐతే అంతటి శ్రీరాములుంగారకి స్వంత భూములేకుండా వుంటాయా? ఒకవేళ లేవే అనుకోండి. అనుకోడం ఎందుకూ? తన పొలంగట్లు తానే యెరగనన్ని భూములదివరకే వున్నాయి. పైగా బాధితుడుగా కొందరు పేద వాళ్లు సాగుచేసుకునే భూములు క్రొత్తగావచ్చి కలిశాయికూడాను.

ఐతే అసలువిషయం యేమిటంటే - ఈయన మాగాణీ భూముల్లో చాలా పెద్దపెద్ద కుప్పలు పడ్డాయి. ఆసవాకోటి కుప్పల్లో ఏదోఒక కుప్ప ప్రక్కనే, ఎవడో ఒకడు, తన అర ఎకరంలో పండిన పైరూ తెచ్చి పోగు పెట్టుకున్నాడు. -

'ముండాకొడుకు!' ఆయన కుప్పతోపాటే వుంటే కుప్పకావలి తప్పౌతుందని 'స్వార్థం' - ఆలోచం

చాడు. నిజంగానే ఈస్వార్థుడికి కుప్పకావలి తప్పింది.

సరే. కొన్నాళ్లు గడిచాయి. పెద్ద హంగామాతో శ్రీరాములుంగారి కుప్పకాస్తా నూర్పిడై పోయింది. దానితోపాటే ఆప్రక్కనేవున్న యీస్వార్థుడి కుప్పకూడా—

'కుప్పకావలి తప్పుతుంది' అనే స్వార్థంలోపడ్డ ఈపేద ముండావాడికి కుప్పకావలి ఒకటేకాదు. నూర్పిడి ఖర్చూ, ఆగింజలు తినేబాధా, అన్నీ - అన్నీ తప్పిపోయాయి.

ఆ తర్వాత ఎప్పటికో-తీరికచేసుకుని వచ్చాడు పేదవాడు. కుప్పను చూచుకున్నాడు. కుప్పను ఎలా చూచుకుంటాడు? కుప్ప వుండాల్సినచోటు చూచుకున్నాడు. 'లబోదిబో' మన్నాడు. శ్రీరాములుంగారి పాదాలమీద రెక్కలు కట్టుకుని వ్రాలాడు. ఏడ్చాడు. మొత్తుకున్నాడు.

శ్రీరాములుంగారికి అంతా అవగతమై పోయింది.

"ఓరి పిచ్చనాగన్నా! మన పెద్దకుప్ప పిల్లని పెడితే అది నీదెలా అవుతుందిరా!?" అన్నాడు శ్రీరాములుంగారు. భగవద్గీతలో నిష్కామయోగం చదువుతూ-యింటికిచేరిన ధాన్యం తిరిగి యివ్వడానికి యిష్టంలేకనేమో!

"మరి నాకుప్ప...?"

" ఏ దొంగ ముండాకొడుకులు కట్టుకుపోయారో."

ఈ పిచ్చినాగన్న నివ్వెరపోయాడు. ఇంకా గట్టిగా ఏడ్చాడు. కాని శ్రీరాములుంగారి అంతటివాడు చెబుతున్నా గూడా నమ్మకపోతేఎలా? పైగా భగవద్గీత పట్టుకుని చెబుతోంటే.

శ్రీరాములుంగారికి కోపంవచ్చింది. బర బరా బయటికి ఈడ్పించాడు.

పిచ్చినాగన్న వూరుకోలేదు. ఊళ్లో పెద్దలుగా చలామణీఅయ్యే ప్రతివాళ్ళదగ్గరికీ పోయాడు. మొర్ర పెట్టుకున్నాడు. కాని ...... 'శ్రీరాములుంగారి కుప్ప పిల్లని పెట్టలేద' ని వాళ్లు మాత్రం ఎలా అనగలరూ? ఐనా మెల్లగా హెచ్చరించి చూచారు. ఏదో కొద్ది మందే -

" ఏటా మనకుప్పలు పిల్లల్ని పెడుతుంటాయి. ఈ ఏడుకూడా అన్నీ పెట్టాయి. అలాంటప్పుడు ఇంత పెద్దకుప్ప పిల్లని పెట్టలేదంటే నమ్మడం ఎలా?" చెప్పాడు. శ్రీరాములుంగారు అతి ప్రశాంతంగా -

పెద్దమనిషిమీద ఇలాంటి నిందవేసినందుకు - ఆ 'స్వార్థుడికి' వూళ్ళో చోటులేకుండా పోయింది.

ఇక ఆ పేదవాడు ఊళ్ళవెంట పడ్డాడు. పిచ్చి నాగన్న గదూ! ప్రతి ఊళ్ళోనూ ఏడ్చాడు. అలా వెళ్ళి వెళ్ళి తన ఏడ్పుకు ఎదురు చెప్పకుండా వినే అరణ్యాలకు వెళ్ళిపోయాడు. చీమలుదూరని చిట్టడవి, కాకులుదూరని కారడవి అన్నిటిలోనూ అలాగా ఏడ్చుకుంటూ తిరిగాడు.

అలా ఏడ్వగా ఏడ్వగా, ఏడుస్తూ తిరగగా తిరగగా—ఓ ముసలినక్క ఎదురయింది. ఇతగాడి ఏడ్పంతా చాలా ఓపిగ్గా విన్నది. "ఓయి పిచ్చినాగన్నా! రా. నా వెంటరా! తియ్యి. విరా ఊరికి దారితియ్యి." అన్నది.

పిచ్చినాగన్నగదూ! దారి తీశాడు.

—ఈవార్త ఊరంతా గప్పున పాకింది. అలా పాకి అలాపాకి శ్రీరాములుంగారి చెవిదాకా కూడా ఎక్కింది. ఆయనకి కోపమూ ఎక్కింది. ఐనా ఒక పాళాన అణచుకున్నాడు. 'ప్రజాస్వామ్య' పద్ధతి ప్రకారమే పరిష్కరించాలనుకున్నాడు,

అక్కడి జనానికంతా ఆ విడ్డూరం చూడాలనీ వుంది; శ్రీరాములుంగారి కెక్కడకోపంవస్తుందో అనీ వుంది.

"ఆ నక్క చెప్పేన్యాయం కూడా వినడమే న్యాయం" అన్నాడు శ్రీరాములుంగారు. ప్రజాస్వామిక వాదిగదూ!

నక్క తీర్పు

ఊరు పూరంతా పోర్లగిలబడింది. ఊరిబయట కొచ్చి పోగుబడింది.

ఊరిబయట జంబూకంగారు కొలువుతీర్చి కూర్చున్నారు. ఉలకడంలేదు. పలకడంలేదు. పైగా అందరికీ జల్లితోకమాత్రం చూపుతూ, తూర్పుగా తిరిగి కూర్చొంది.

జనం అలా ఎంతకాలం అని కూర్చోగలరు?

ఓ పెద్దమనిషి లేచాడు. "జంబూకం! ఓ జంబూకం! ఏదో తీర్పు చెబుతానని తెగబడి వచ్చావటగా! అలా తూర్పుకు తిరిగి దణ్ణం పెడుతున్నావేం?" అడిగాడు.

జంబూకం ఏమీ తటపటాయించలేదు.

"తూర్పు సముద్రం తగలబడిపోతోంటే చూస్తున్నానండీ" అన్నది. అంతా ఆశ్చర్యపోయారు.

"సముద్రమేమిటి? తగలబడటమేమిటి?" అన్నారు. ఒక్కసారిగా—

"అవేం? ఆమంటలకి తట్టుకోలేక చేపలన్నీ చెట్లెక్కుతుంటేనూ!" అన్నది జంబూకం.

"చేపలెక్కడన్నా చెట్లెక్కుతాయా?" అన్నారు జనం.

జెభై

"కుప్ప ఎక్కడన్నా పిల్లల్ని పెడుతుందా?" అడిగింది జంబూకం—

"పెట్టదు. పెట్టదు" అన్నారు జనమంతా. వెనుక ముందూ చూడకుండానే—

ఒకరిద్దరు పెద్దలుమాత్రం గుక్కతిరక్క గుటకలు మింగారు.

"ఏమిటీ? కుప్ప పిల్లల్ని పెట్టదూ?" శ్రీరాములుంగారికి కోపంవచ్చింది. అరికాలిమంట నెత్తికెక్కింది.

"ఈ వెధవ నక్క నా రాజ్యంలో శాంతికి భంగం కలుగజేసింది. లేకపోతే ఈ సామాన్యజనం 'కుప్ప పిల్లల్ని పెట్టదు.' అని అలా ఎలా అనగలుగుతారు? ఎన్ని గుండెలతో అంటారు? శాంతి భంగమైపోయింది." 'శాంతిరక్షణకోసం నక్కని అరెస్టుచెయ్యాలి' శాసించాడు శ్రీరాములుంగారు.

కాని...ఏదీ నక్క? నక్కలేదు. నాగలోకమూ లేదు. శాసనం చలామణీ కానూలేదు. యింత వరకూ ఎవ్వరికీ కన్పించనూ లేదు.

శ్రీరాములుంగారికి మాత్రం అప్పుడప్పుడూ దాని జల్లితోక కలలో కన్పిస్తూ వుంటుందట.



# పాలేరు

సీతయ్య రెండు సంవత్సరాల తర్వాత తిరిగి వూళ్లోకి వచ్చాడు. అతని దేహంలోగాని, ఆరోగ్యంలో గాని, మార్పేమీ కనబడ్డంలేదు. కాని, అతనికిమాత్రం ఊరంతా మారిపోయినట్టే కనబడుతోంది. అతనికి తెలిసిన మొట్టమొదటి మార్పేమిటంటే——

తాను జైలుకి పోయేటప్పుడు యాభై, అరవై రూపాయలకు కుదిరిన పాలేర్లు యిప్పుడు "వందకైనా రాము" అంటున్నారని—. ఎవణ్ణి కదిలించినా ప్రతివాడూ "యుద్ధం-అధికధరలు" అంటున్నారని.

ఈ విషయంలో సీతయ్య అంత తేలిగ్గా ఒప్పుకోడానికి వీల్లేదు. ఊరంతా చాలాభాగం ఆయన మాట మీదే నడుస్తుందని ఆయనకు గట్టి నమ్మకం. అలాంటప్పుడు తానే మొట్టమొదటిగా రేటు పెంచితే—?

వాస్తవానికి సీతయ్య ఇతరులను గురించు అంతగా శ్రద్ధతీసుకునేరకం కాకపోయినా – తనవరకైనా నలుగురు పాలేళ్లకూ నాలుగొందలు చూస్తూ చూస్తూ ఎలా గుమ్మరించడం ?

దేనికైనా మంచిదని ఏదోఒక సీజనులో అలా జైలుకు వెళ్లివచ్చినా నిజానికి ఆయనకు వ్యవసాయం

డైభైరెండు

మీదవుండే ప్రేమ అంతంతకాదు. నాలుగు అరకలు, నలుగురు పాలేళ్లు- దొడ్డినిండా పశువులు, కళకళలాడు తూవుంటే వుండే ఆనందం వేరే మెలా వుంటుంది.

అసలు మొదటినుంచీ సీతయ్య వ్రేలు పెట్టిం దల్లా బంగారం అవుతూ వచ్చింది. అందుకనే సీతయ్య జాతీయోద్యమంలో చేరేటప్పుడే "ఇందులో ఏదో లాభం వుంది. లేకపోతే సీతయ్య దిగకేం?" అనుకున్నారంతా. సీతయ్య స్వార్థాన్ని జాతీయోద్యమానికి ముడిపెట్టేశారు.

అదేమిటో! అచ్చగా అలాగే సీతయ్య ఒక నాయకుడు కావడం; ఆ పలుకుబడితో వ్యాపారం సాగిం చడం; అదీ చిలవలు పలవలై ఏపట్టణంలో చూచినా సీతయ్య వ్యాపారమే ఐపోయింది.

సీతయ్యకు ఎదురు మాట్లాడ్డానికి ఎంతలేసి వాళ్లూ అంతగా ధైర్యం చెయ్యలేరు. అలాంటిది రెండేళ్లు గడిచేసరికల్లా పాలేళ్లు - అందులోనూ రెక్కాడితేగాని డొక్కాడని రకం "వందయిస్తేగాని రాము" అంటు న్నారంటే ఎలా వుంటుంది?

ఎలాగైనా పదిమందిలో తిరగనేర్చినవాడు గనుక-ప్రతిదానికీ పట్టుమని కోపం తెచ్చుకోవడం ఆయన ప్రకృతికే పరమవిరుద్ధం గనుక - ఆ ఉక్రోషాన్నంతా

పుక్కిటనే పట్టేశాడు. వాళ్లేవచ్చి ముందుగా అడిగితే అప్పుడే వెళ్లగ్రక్కొచ్చని—



ఏరువాక పున్నమ దగ్గరకొస్తోంది. ఏరోపున్నాన్నించి ఏరోపున్నానికి కాలచక్రానికి ఒకచుట్టు. ఇది పాలేళ్ల జీవితంలో ఒక సంవత్సరం.

సంవత్సరకాలంనుంచీ యజమాని సేవతో విసిగిపోయిన పాలేరు క్రొత్త యజమానికోసం తహతహ లాడుతుంటాడు. యజమానులుకూడా ఎలుకంత తిని ఏనుగంతపని చేసేవాడు ఎవడా? అని వెతుకుతుంటారు.

ఏరువాక పున్నమ వస్తుంది. క్రొత్త యజమానులు, క్రొత్త పాలేళ్లు, అంతా పదిరోజులపాటు క్రొత్తొకవింత.

తిరిగీ కొద్ది రోజుల్లోనే తృప్తి అనేది ఎరుగని యజమాని 'గునుసుడు' సాగిస్తాడు. పాలేరు 'మెప్పులేని బండచాకిరీ' అనుకుంటాడు. క్రమక్రమంగా ఇద్దరి మధ్యా అగాధం పెరుగుతుంటుంది.

అధికమాసం రావడంతో క్రొత్త పేచీ ఒకటి ఉత్పన్నమయింది. కాలచక్రంలో అధికమాసాలు ఎన్ని రాలేదు? ఎన్నిపోలేదు? కాని ప్రక్కనే న్యాయమైన హక్కులకోసమంటూ సాగుతూన్న అనేక పోరాటాల

పరిభావం యీ బానిసల్లోకూడా ఓ రకం చైతన్యాన్ని రగిలించింది.

"మేం పన్నెండుమాసాలే నౌకరీ చేస్తాం. కాని పదమూడు మాసా లెందుకు చెయ్యాలి?" అన్నారు పాలేళ్లు.

"పున్నమదాకా చేస్తేగాని సంవత్సరం కాదుగా." అన్నారు యజమాన్లు.

"ఇంగ్లీష్ తేదీవేసి లెక్కగట్టండి."

"ఛిఛిఛీ! ఇంటి లెక్కల్లోకూడా ఇంగ్లీష్ వాడి పొత్తేనా? ఇంకేం స్వరాజ్యంరా దేవుడా!" అని దిగులుపడ్డాడు, నిత్యం కోర్టులచుట్టూ ప్రదక్షిణాల్జేసే ఓ పక్కా పెద్దమనిషి.

"ఓహో! యిప్పుడు తెలిసింది. వీళ్లు అంత ర్జాతీయ దృక్పథంతో మాట్లాడుతున్నారు. వీళ్ళకి యీ అంతర్జాతీయత ఎక్కడనించి వచ్చిందో ఆలోచించండి. అమ్మో! అమ్మయ్యో!! పేడపిసుక్కునే ముండాకొడుకు లకు రాజకీయాలు నేర్పితే దేశ మేమౌతుంది? పారపనిలో పాకిస్థాన్, గడ్డివాములో కంఠశోష, జనపకోతలో జాతీ యైక్యత, రాజకీయాల్తో పనిగల్లంతు. దేశంలో కరువు కాటకం. తిరిగీ వీళ్ళంతా 'తిండిదొంగలు తిండిగొంగలు' అంటూ తెగ అరవడం. ఈ విషం ప్రబలకముందే మందు

వెయ్యాలి. రైతు సోదరులారా కళ్లు తెరవండి. మిమ్మల్ని ఆర్గనైజ్ చేస్తాను. ముందుండి నాయకత్వం వహిస్తాను.'' అని చిన్న లెక్చర్ దంచాడు, రోజు కో రకంమార్చే కోటేశం.

" నెలరోజులకోసం పోరాటమా ? వెధవ పోరాటం — తీస్తే బడాబూర్జువా మీద మొనాపలిస్టుల మీద తియ్యాలిగాని — ఎందుకొచ్చినపోరాటం ? '' అన్నాడు ప్రతిదాన్ని ' మార్క్సిస్టు దృక్పథంతో ' అనే పడకకుర్చీ పాలిటీషియన్ కిష్టయ్య.

' ఎక్కువజీతం అడిగేటట్టున్నారే ' అనే దాని తోనే మండుతోన్న యజమానులకు ఈ అధికమాసం పేచీ అగ్గిమీద గుగ్గిలం వేసినట్టయింది. అంతా ఒక్కసారి పోయి సీతయ్యమీదపడ్డారు.

'' ఆ విషయ మేదో నా దగ్గరే తేల్తుందిగా ? మీరల్లా ఊరకేచూస్తూ నావెంట ఉండండి. '' అన్నాడు సీతయ్య.

సీతయ్యగారి పెద్దనౌకరు వెంకన్నకు ఇవేమీ పట్టవు. అదోరకంమనిషి. ' ఇలాంటి అధికమాసాలు రెండు కలిసివచ్చినా అతన్నేమీ కదల్చలేవు. కాని శివయ్యగారు ఇరవైరూపాయలు ఎక్కువయిస్తానన్నాడు. వెంకన్న కూడా ఒప్పుకున్నాడు. అందుకని సీతయ్యగారికిచెప్పి,

డబ్బు లెక్క చూచుకుందామనుకుంటున్నాడు. మూడు రోజులనుంచీ విశ్వప్రయత్నం చేస్తున్నాడు. సీతయ్యగారికి చెప్పాలని ; కాని భయం. ఎట్లాగో గుండె రాయిజేసు కున్నాడు. వసారాలో కూర్చుని పత్రికచదువుకుంటూన్న సీతయ్యగారిముందు నిలబడ్డాడు. కిటికీ వూచలు జాగ్ర త్తగా లెక్కపెడుతున్నాడు.

"ఏం రా? కొయ్యలాగా అలా నుంచు న్నావ్?" అన్నాడు, సీతయ్యగారు ఆంధ్రపత్రిక క్రిందకు విసురుతూ.

"ఊం-ఊ-"

"ఊం- ఊం- ఏమిటిరా? తొత్తుకొడుకు ల్లారా! మీ వ్యవహారం మరీ శృతిమించి రాగాన పడు తోందటే? కుర్రకుంక లేదో "కూలిపెరగాలి" అని కేకలు పెడితే మీరుకూడా దాన్నే లంకించుకుంటార్రా? హుం! తిందురుగాని రెండు చేతుల్తో—"

"అసలాళ్ల దగ్గిర కెప్పుడూ పోనుండి. నాకా గొడవే తెలవదు."

"తెలవదు. తెలవదు. ఎలా తెలుస్తుంది? రేపట్నుంచీ బొచ్చెలు బెకబెకలాడుతుంటే-అప్పుడూ!"

"కాదండి. దొరగారూ! యింటికాడ మీ కమతగత్తె ఒకటేతీర్న గోలబెడతందండీ: జీతం సాలదని...

శివయ్యగారేమో యిరవై రూపాయలు ఎక్కువిత్తా మన్నారంటా...''

''ఉహూఁ! యికనేం? ఆ ఎక్కువిచ్చే యిరవై యిలా నాకు గట్టిపో. పోతానంటే బ్రతిమాల్తా ననిరా నీయేడుపు? తొందరగా దయచెయ్!''

''డబ్బు లెక్కజూత్తే ఏరోపున్నుందాకా చేసి పోతానండి.''

''అధికమాసం చెయ్యరుగదటోయ్''

''అదంతా నాకేమీ తెలవదు దొరగోరూ! మీపాదాల దగ్గిర బతికేవాళ్లకి మాకీ అల్లరంతా దేనికండీ!''

''ఏమి నాటకాలురా! పో-యీ క్షణంనించీ నాదొడ్లో కనబడ్డావా !! డొక్క చీల్చానన్నమాటే. ఫో! ముందు బజార్లోకిపోయి మాట్లాడు.''

వెంకన్న కిదేమీ అర్థంకావడంలేదు. దొరగారికి తన మీద కోపందేనికో? అలాగే నిలబడ్డాడు. వెంకన్నకి డబ్బుమీదే ప్రేమ. ఎన్నైనా తిట్టు-కొట్టు. డబ్బు ఖచ్చితంగా యిస్తేసరి.

''ఏం రా? యింకా అలానే నుంచున్నావ్. ఫో ముందు. పోతావా? గెంటించాలా?''

''దొర-గా-రూ! డబ్బు''

"నాలుగు నెల్లు నాగాలున్నాయిట గదరా! వాటికెవర్రా? నీ అమ్మామొగుడు-"

"ఔనండి. మనబండి నడుంమీదుగా పోయి నప్పుడు నాలుగునెల్లు నయంకాక రాలేదండి."

"నీవురాని నాలుగు నెల్లూ రోజుకు రెండు రూపాయలిచ్చి మనిషిని పెట్టారు. మొత్తం రెండువందల నలభై రూపాయలయింది. నీకు రావలసిన జీతం రెండు సంవత్సరాలకీ రెండుఎనభైలు నూటఅర వై రూపాయలు. పోతే యింకా ఎనభై రూపాయలు నీవేనాకు బాకీ. పెళ్లాం తెచ్చిన బర్రెపడ్డ వుంది గామాలుగా - తోలిపెట్టు! సరి పోతుంది."

వెంకన్నకు ఒక్కసారిగా పిడుగుపడ్డట్టయింది. సీతయ్య తిరిగీ పత్రిక చదువుకోడం మొదలు పెట్టాడు.

వెంకన్న కొయ్యబారిపోయాడు. నడుంమీ దుగా బండి పోయినప్పుడు నాలుగునెల్లు నానాఅవస్థ పడ్డాడు. వైద్యుడికి యిరవైరూపాయలు యిచ్చుకున్నాడు. తాను మళ్ళీ కాలు భూమ్మీద మోపేదాకా యింటిల్లి పాదీ పస్తులు పడుకుంటూ వచ్చారు. యిదంతా యెందుకు? దొరగారి పనికోసమేనా? ఐనా లెక్కలో నాలుగునెల్లు నాగాలు. పైగా చిల్లరఅప్పులు. అవన్నీ చాలక రెండేళ్ళ జీతమూచాలక యింకా ఎనభై ముదరా-"అమ్మయ్యో!"

వెనక్కు తిరిగాడు.

దొడ్లో పశువులన్నీ జాలిగా "ఉండు" మని బ్రతిమాలుతున్నాయనిపించింది. వాటిని విడిచి పోవడం కష్టమనిపించింది. ఔను. రెండేళ్ళపాటు ఆ యింట్లో ప్రతి వస్తువూ తనకు చెందిందిగానే వుంది. అన్నిటినీ 'మన' అనే భావించుకున్నాడు.

కాని — రెండేళ్లు అరవచాకిరీ చేయించుకుని నాగాలక్రింద యింకా యెన్నైతే తనకే రావాలనే ఆయన దగ్గర పనిచేసేదెట్లా ?

యీ గుంర్ఘాటనతో బలవంతాన కాళ్ళని యింటిదారి పట్టించాడు. "రెండేళ్లు - రెండేళ్ళకష్టం-" ఆ రోజుల్లో —

తన మేనమామ కూతురు రోజల్లా కష్టపడి, చేతులుకంది, మోపెడు కందిమోళ్లు పీకి పెట్టుకున్నది. తాను న్యాయంగా ఆ మోపెడుమోళ్లూ సీతయ్యగారి చేలోవిగనక- పోట్లాడి మరీ లాక్కొచ్చి సీతయ్యగారి దొడ్లో పారేశాడు.

తన పెదతండ్రి గేదెల్ని సరిగ్గా కట్టివేసుకోక సీతయ్యగారి జొన్నచేను పాడుజేయిస్తోంటే - పెదతండ్రి అనైనా చూడకుండా బందెలదొడ్డికి తోలించాడు. ఐన వాళ్లతో తగువు తెచ్చుకున్నాడు.

ఎనభై

పందులు పైరు పాడుజేస్తున్నాయని ఎరుకల వాళ్లతో తగువాడి తన్నులు తిన్నాడు.

ఆసామి ఎడ్లకి ఎక్కడ ప్రమాదం జరుగుతుందో నని గభీమని దూకి బండికిందపడి నడుం విరగ్గొట్టు కున్నాడు.

యివన్నీ ఎవరికోసం? యిందుకు ప్రతిఫలమే మిటి? రెండేళ్లు వృధా చాకిరి. పైగా యెనభైరూపా యల పైదండగ—

వెంకన్న యింటికి చేరుకున్నాడు.

సంగతంతా విని పెళ్లాం తిట్టడం మొదలెట్టింది. సీతయ్య దుర్మార్గాన్నీ, మొగుడి తెలివితక్కువనీ, కలిపి తిడుతోంది.

ఈ తిట్లు వింటే సీతయ్యగారు యింకా డబ్బి స్తాడా? ఇప్పటిదాకా "యియ్యొచ్చు" అనే నమ్మకం వెంకన్న నో మూల పీడిస్తూనేవుంది.

"నోరుముయ్. ముయ్యవేం—" అంటూ వెంకన్న పెళ్లాన్ని గభీగభీ నాలుగు వుతికాడు. ఛిమఛిమ లాడుతూ ఎటో వెళ్లిపోయాడు.

సీతయ్యచేసిన పని ఊరంతా ఒక్కసారిగా గప్పుమన్నది. అందరూ 'దారుణం' అంటే — కొందరు 'తగినపనే' అన్నారు.

" రైతుకూలి సామరస్యం, అంటారుగా—అదెలా తెస్తారోచూస్తా. " అనుకున్నాడు కోటేశం.

ఆవేళ రైతులంతా సమావేశమాతున్నారు. రైతుసంఘ ఆఫీసులో —

" అధికమాసం మూడు సంవత్సరాలకి ఒక్కసారి వస్తుంది. కాబట్టి పాలేర్లు సంవత్సరానికి పదిరోజులు అధికంచెయ్యడం న్యాయం " అని తీర్మానించారు.

కోటేశం తెల్లమొగంవేశాడు. దేన్ని అగ్గైజు చెయ్యడమా ? అని —

" పాలేర్లు దీనికి ఒప్పుకోవాలిగా " అని తృప్తి పడ్డాడు. కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. ఎక్కడ వినబోయినా రైతుసంఘంవాళ్లు చేసుకున్న తీర్మానం న్యాయమేనని వినిపిస్తోంది.

ఆరాత్రే పాలేర్లంతా ఒకచోటికిచేరుతున్నారు.

ఆరాత్రి కోటేశంకూడా సీతయ్యా పేరు మీదుగా రైతాంగాన్నంటూ కొందర్ని పిలిచాడు.

" ఈ విషయంలో అంతా ఒకటిగా ఉండాలనీ, అవసరమైతే పాలేళ్ళను పొరుగూరునించి పిలిపించాలనీ, ఎక్కువ డబ్బియ్యాల్సి వచ్చినా వాళ్ళకే యివ్వాలనీ, కౌలు పొలాలుకూడా లాక్కొని అన్నివిధాలా కూలీలని లొంగదీయాలనీ,—కొన్ని తీర్మానాలుచేశారు.

యెనభై రెండు

నిద్రపోగా మిగిలిన వాళ్ళెవ్వరూ ఎదురు చెప్ప లేదు. కోటేశం వుత్సాహం పట్టశక్యంకాకుండావుంది. ఆర్గనైజు చెయ్యడం అయ్యేపోయింది. యిక నడపడం ఎప్పుడా ? అన్న ఆదుర్దాలో వున్నాడు.

వెంకన్న ఆరాత్రి పాలేర్ల సమావేశానికి పోనే లేదు. కోటేశం బోధ బాగా వెంకన్న బుర్రకు పట్టింది.

శీతయ్య కోపానికంతకూ కారణం సంఘమే నని; ఊళ్ళోకల్లా పెద్దరైతుని అలా ధిక్కరించడం క్షేమం కాదనీ, వెంకన్న వేరే సంఘంపెట్టి తనమాటల్లో వుంటే కాని ఆడబ్బు యివ్వడనీ కోటేశం చెప్పాడు. అంతే నన్నాడు వెంకన్న. అందుకే ఆ సమావేశానికి వెంకన్న పోలేదు.

కాని... ఎవరో యజమానులకు భయపడే వాళ్లు మినహాయిస్తే పాలేర్లంతా సమావేశమయ్యారు.

పెరిగే ధరలకు అనుగుణ్యంగా జీతాలు వుండా లనీ, అధికమాసం విషయంలో రైతులు తీర్మానించు కున్నట్టే ఏటా పదిరోజులు అధికంగా చెయ్యాలనీ, గుడ్డలు, చెప్పులు తీసుకోవాలనీ, నెలకొక్కరోజు సెల వుగా ఏటా 12 రోజులు నాగాలు కట్టరాదనీ యిలా తీర్మానాలు చేసుకున్నారు.

తెల్లవారే సరికల్లా-వెంకన్న పాలేర్లనందర్నీ

బండబూతులు తిడ్తున్నాడు.

పాలేర్లుమాత్రం వెంకన్న విషయం తేల్చుకో డానికి సీతయ్యగారింటికి వెళ్తున్నారు.

పాలేళ్లంతా సీతయ్యగారింటికి వెళ్లారు. వెనక వక్కన వెంకన్న తిడ్తున్నాడు. 'నాగొడవ మీకెందు కురా?' అని—. వెంకన్నని వెనక్కు యీడుస్తోంది పెళ్లాం.

కోటేశం యిదంతాచూచి ఏడవ వలసిందేకాని నవ్వుతున్నాడు అరుగుమీద కూచుని.

సీతయ్యకి వీళ్ల సందర్శి చూడగానే అరికాలి మంట నెత్తికెక్కింది. మీరంతా బందిపోటు దొంగలు నాయింటిమీదికి దొమ్మీకి వచ్చారు. కేసుపెట్టి దుంప తెగవేస్తా."

"రెండేళ్ల వృథా చాకిరికంటే ఏమంత కష్టం కాదులెండి" అన్నాడు వెంకన్న బావమరది.

"మాటలునేర్చిన కుక్కని 'జూ' అంటే 'ఇజ్జూ' అంటుందిరా. 'హరిజనులు హరిజనులు' అని గాంధీ మిమ్మల్ని మా నెత్తికెక్కించాడు. మేమూ ఎక్కించుకున్నాం. నీళ్లు తెప్పించడం, పక్కలు వేయిం చడం అంతా మీచేతేనాయె. యింక మీరు మా మాకెం దుకు వింటారు?"

"ఇదివరకముందే హాయిగావుండేది. యిప్పుడు

యింటో చాకిరీ, బయట చాకిరీ రెంటితో చస్తున్నాం.''

''చాకిరి చేయించుకుంటే యేం. అంటుకో రాని వాళ్లని పేరుపెట్టి యిచ్చేది తక్కువ జీతమేగా-''

''అసలు అదంతా ఎందుకోయ్. పాలేర్లంటే అచ్చగా అంటుకోకూడనాళ్లనేనా? మేము సూత్రం లేమూ-?''

వాళ్ళల్లోకల్లా పెద్ద ముందుకు వచ్చాడు. అందర్నీ ఆపాడు. అసలు విషయం ఎత్తుకున్నాడు.

''మీ పనిలోనే బండికింద పడ్డాడు. నిజానికి వాడి కుటుంబాన్ని ఆ నాలుగునెల్లూ పోషించాల్సింది మీరు. - పోనీ కనీసం ఆ నాగాలైనా కట్టుకోకుండా వుండండి''

సీతయ్య ససేమిరా అంటే ససేమి అన్నాడు.

''పోనీ ఆ నాగాలకు డబ్బు మినహాయించ డంలో —— మీరు ఏ రేటున జీతం యిస్తున్నారో ఆ రేటు లోనే విరగగొయ్యండి.''

''ఊహూఁ''

''ఇంత అన్యాయమైతే మీ దగ్గర యెవరుం టారు?''

''మెతుకులుండాలేగాని కాకులు కావలసి నన్ని-'' అన్నాడు సీతయ్య.

సీతయ్యగారింట్లో అప్పటిదాకా పనిచేస్తున్న ముగ్గురు పాలేళ్లూకూడా బయటికి వచ్చేశారు.

పొరుగూరినుంచి ఎవణ్నైనా తెచ్చినా వాణ్ని నిలవనీయడం లేదు. వాళ్లూ యీబోధలలో పడిపోతు న్నారు.

చాలామంది రైతులు పాలేర్లను పెట్టుకుంటు న్నారు. ఏటా పన్నెండు రోజులు సెలవులుకూడా ఒప్పు కుంటున్నారు. సీతయ్యకు మద్దత్తుగా వాళ్లుకూడా మెల్ల మెల్లగా జారుతున్నారు. కోటేశం ఏమయ్యాడో!

ఏరోపున్నమి రేపు. రైతులంతా ఏరువాక సన్నాహాలు చేసుకుంటున్నారు. సీతయ్యకిమాత్రం తాడూ బొంగరం లేకుండావుంది. పైగా చేస్తున్న పనివాళ్లుకూడా మానుకుంటిరి.

ఆరాత్రే రహస్యంగా వెంకన్నడబ్బు వెంకన్నకి పంపించేశాడు.

మర్నాటి ఉదయం రైతులంతా పాలపొంగళ్లు చేశారు. ప్రతి యిల్లూ కళకళలాడుతోంది. సాయంకా లానికి అరకలకు పూజలు పూర్తయినాయి. ఎడ్లమొగాన వసుపుకుంకుమ పెట్టారు. కోటేస్లు సాగుతుంటే రైతు స్త్రీలు హారతులెత్తారు. రైతులు అరకలతోనూ పాలేళ్లు విత్తనాలతోనూ బయలుదేరారు. ఆ గొందినుంచీ యీ

గొందీనుంచీ అన్ని అరకలూవచ్చి ఊళ కలుస్తున్నాయి. పాలేళ్లు జైమని జేజేలు కొడుతున్నారు.

అరుగుమీదినుంచీ గబగబా లోపలికి దూసుకుంటున్నాడు. సీతయ్య-

“నాలుగు రోజులుపాటు మొఖం తప్పిస్తే పోయేది. యీసారి మనకు లేబరులోనించి ఒక్క ఓటు పశితే ఒట్టుబెట్టు.” అన్నాడు. చూచిపోదామని వచ్చిన మాళయ్య.

———:o:———

“పెద్దమనుష్యులని అనబడే వారిలో
వుండే స్వార్థం, సంకుచితత్వం,
అసూయ, నైచ్యం, ద్రోహబుద్ధి-
నికృష్ట మానవులనబడే వారిలో వుండవు.”

— గోర్కీ.

# పరిశోధన

రాత్రి తొమ్మిది గంటలయింది. ఇంకో గంటలో సినిమా వదిలేస్తారు. అప్పటికే తాను టౌన్ చుట్టూ రెండుసార్లు చుట్టివచ్చాడు. ఈ రెండుచుట్లలోనూ అన్నివీధులూ అన్నిగొందులు కలియతిరిగినట్టే. ఫలితం మాత్రం రోజూలాగానే శూన్యం. ఆ విసుగుతోనే వచ్చి సినిమాహాల్లో జొరబడ్డాడు. టిక్కెట్టు డబ్బులతో పని లేదుగనుక అలవాటుప్రకారం బాల్కనీలోకే వెళ్లాడు. అన్ని ఖాళీ కుర్చీల్లోనూ ఒకదాంట్లో అనుకోకుండానే చేరగిలబడ్డాడు.

కూర్చున్నాకగాని తెలియలేదు అతనికి 'చాలా అలిసిపోయినట్టు' — ఆ సినిమాసంగతీ అప్పుడే తెలిసింది. అదే హాలులో అదేసినిమా అదేబాల్కనీనుంచి సవాలక్షసార్లు చూచాడు. ఐనా అలాగే కాళ్ళుబార్లాచాపాడు. బుర్ర వెనక్కి వేళ్లాడేశాడు. కళ్ళు గట్టిగా మూసుకుని సినిమా చూస్తున్నాడు. వాల్చేసిన బుర్ర ఎక్క డెక్కడో తిరుగుతోంది. కాళ్లు కదలడంలేదు.

ఉక్కబోస్తోంది. పైన పంకా పనిచేయడం లేదు. క్రింద నల్లులు పనిచేయడం మాననూలేదు.

యెనభైయెనిమిది

గభీమని లేచాడు. గబ గబా క్రిందికి దిగాడు. హాలు బయటికి వచ్చాడు. వరండాలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. తలకాయలో ఆలోచనలు అంతకంటే ఘోరగుతున్నాయి. బూట్లు 'టక్ టక్' తాళం కొడుతున్నాయి. గుండెలు అంతకంటే వేగంగా కొట్టుకుంటున్నాయి. ఆందోళన ... ఒకటే ఆందోళన.

తాను వెతుకుతూనే వున్నాడు. పగలులేదు. రాత్రిలేదు. పట్ణమంతా దినమూ పదిసార్లేనా కలదిరిగి వదుల్తున్నాడు. గాలించేస్తున్నాడు. సైకిల్ టైర్లు అరిగి పోతున్నాయి. కాళ్లల్లో సత్తువ కరిగిపోతూవుంది. ఫలితం మాత్రం శూన్యం.

ఇంతకూ తన దురదృష్టం. అంచెమీద అంచె అలాఅలా పైకిపోయే అదృష్టం తనకి పట్టలేదు.

వరండాలో ఆ చివరనించీ యీ చివరకూ యీ చివరనుంచీ ఆ చివరకూ—తిరిగి తిరిగి ఆకస్మికంగా కాళ్లు ఆగి వూరుకున్నాయి. ఆసంగతి అతనికేమీ తెలియదు. మూడు నిప్పు పుల్లలు ఖర్చై ఓ సిగిరెట్టు కాలింది. పొగలు క్రక్కుతున్నది. అదీ అతనికేమీ తెలియదు.

హాలుగేటులో, ఆ వైపు వరండాలోనే ఓ నీడ కదలింది. అతని కళ్లు పసికట్టేశాయి. గాజులు గల్లుమని మోగాయి. అతని చెవులు విన్నాయి. యిప్పుడు

మనస్సు పనిచేయడం ప్రారంభించింది. ప్రారంభించడమే తరువాయి అనుమానించింది. అనుమానించడం ఆ మనస్సుకు అలవాటే. 'అనుమానం' నుంచేగదూ! పరిశోధనలు ఫలించేదీ.

ఆ నీడ ఆడరూపంలో బయటపడింది.

అతగాడికళ్లు టప టపా కొట్టుకున్నాయి. అతగాడి బుర్ర చక చకా తనపని తాను చేసుకుపోతోంది –
'ఏవరిదీ ?'

ఆ ఆడరూపం ఒక్కసారిగా ఇతన్ని చూంచి జడుసుకొంది.

'ఆడవాళ్ళవేపు వరండాలో ఇదేమిటి ? మగాడు! పోలీసు డ్రెస్ తొడుక్కున్న ఆడదా ?!' గబగబా క్రీనీడలో నడిచిపోతోం దా అమ్మాయి.

'అలా క్రీనీడలో ఎందుకు నడుస్తోంది ?'

అనుమానానికి ఆధారాలు వెతుకుతోంది అతనిమనస్సు.

ఆ యమ్మాయి వెనక్కుతిరిగి చూంచింది.

అతనికళ్లు అటే చూస్తున్నాయి.

'అదేమిటి, అలా గుడ్లుపెట్టుకు చూస్తాడు. నెత్తిమీద ముసుగు లాక్కుంది.

తొంభై

'ఎందుకంతభయం, అడుక్కుంటోంది తన్ని తనే అతగాడి మనస్సు.

'ఆ యమ్మాయి తిరిగి తిరిగి చూస్తోంది, పోతోంది.

'ఏమిటిది? ఆ యమ్మాయి ఎందుకలా బిత్తర పోతోంది? తాను పోలీస్ఉద్యోగి. తననిచూచి దొంగలు ......భయపడతారు. ఈ యమ్మాయి దొంగకావాలి. లేదా ... కుచ్చిళ్ళు కొంచెం పైకిలాగి పట్టినట్టు నడుస్తోంది ఆయమ్మాయి.

ఆఁ! ఆ యమ్మాయి దొంగకాదు. కానే కాదు. తేలిపోయింది. ఈ యమ్మాయి...ఆ యమ్మాయి దగ్గర యేవో రహస్య పత్రాలు వుండివుండాలి. అవి కుచ్చీళ్ళల్లో వుండివుండాలి. తాను వరండా కాయడం చూచి 'దొరికిపోయాన'ని భయపడి వుండాలి. అందుకే అలా జాగ్రత్త పడబోతోంది. ఆ తిరిగి తిరిగి చూడటం అందుకే. ఆ భయం అందుకే. అమ్మయ్య! దొరికిపోయింది. తన పరిశోధన ఫలితానికి వచ్చేసింది.'— అతగాడి మనస్సు యింత ఆలోచనా ఓ అరక్షణంలో చేసేసింది.

ఆ యమ్మాయి హాలు మలుపు తిరిగింది.

పోతోంది. పోతోంది. ఐనా చుట్టూ పెద్ద ప్రహారీ గోడలున్నాయి. ఐనా-'ఆలస్యాదమృతం విషం.'

అతగాడి కాళ్లు వెంబడించాయి. పిల్లి కాళ్లలాగా మెత్తగా—

'ఏదీ ?' అతనికళ్లు అన్నివైపులకూ గిరగిరా తిరిగాయి. అంతా చీకటి ?

'అదుగో !' మరుగుదొడ్డిలో గోడమీదుగా తల కాన్పించింది. అంతలో మాయమయ్యింది.

'ఊహూ' కూర్చొంటోందన్న మాట. 'ఎలాగా దొరికిపోయాగదా !' అని ఆ వుత్తరాల్ని వుచ్చలదొడ్లో పూడ్చబోతోందన్న మాట.

మెల్లగాపోయి మరుగుదొడ్డివాకిలి కాచాడు.

'ఆ వుత్తరాలు ఏ రహస్య నాయకుడి కోసం తెస్తోందో? అన్నీ ఒక్క క్షణంలో తేలిపోతాయి.' — కాళ్లు నిలదొక్కుకున్నాడు. రివాల్వర్ పైకితీశాడు. సిద్ధంగా వున్నాడు.

''బుజ్ జ్ జ్'' మని మోత వస్తోంది. దొడ్లో నించి —

అదిరిపడ్డాడు. చేతిబాంబులాంటి మారణా యుధమో? ఏమిటో ఖర్మ —

గుండెలు గుబ గుబమన్నాయి. యింట్లో దోమతెర మంచంలో పడున్న భార్య గుర్తుకొచ్చింది. ఉయ్యాలతొట్లో పాప కెవ్వుమన్నట్టుంది.

తొంభై రెండు

పరిశోధన ఫలితాని కొచ్చింది. ఫట్ మని తాను పైకిపోతాడు. మామూలు పోలీసునుంచి ఒక్కో మెట్టె ఎక్కాడు. హెడ్డూ, రైటరూ మధ్య చక్కర్లు కొట్టాడు. కొట్టి కొట్టి 'సబ్బయ్యాడు.' ఏళ్లకు ఏళ్లుగా ఒకటే సబ్బు. వెధవ సబ్బు. ఏమైనా సరే. యీ దెబ్బతో ఫట్‌మని పైకిపోవాలి.

ఆ ఆశతోనే జారిన గుండెని అసలు స్థానం లోకి తోసేశాడు. వణికే రివాల్వర్ని గట్టిగా గుప్పెట్లో బిగించాడు. పూనికచేసి నిల్చున్నాడు.

'బుజ్‌జ్‌జ్.' ఒకటే బుజ్‌జ్ — ఎంతకూ పేలదేం? వెధవ బాంబు. గుండెలు పీకుతూ ఎంత సేపిలా?'

ఐనా చూతామని భయం భయంగానే తొంగి చూచాడు.

"ఛీ పాడుముండా ఆడది" అతనికే సిగ్గేసింది. గిరుక్కున తిరిగాడు. లెఫ్ట్ రైట్ మరిచేపోయి ఒకే పరుగు తీశాడు. ఒక్క దూకులోపోయి బాల్కనీలో జొరబడ్డాడు.

ఎంత సిగ్గుచేటు - ఓ ఆడది మనుగుదొడ్లో... ఆ బుజ్‌జ్‌జ్‌కు తాను హడిలిపోతాడా?

♦ ♦ ♦ ♦ ♦ ♦

అక్కడ ఆవిడ కేకలు పెడుతోంది. 'ఎవడో

బూట్లు మోగించుకుంటూ తన్నేదో చెయ్యవచ్చా' దని-
ఇక్కడ ఈయన తన తెలివితక్కువ తనానికి విచారపడుతున్నాడు :- "వెనుకా ముందు లేకుండా కాల్చిపారేసి 'కమ్యూనిస్ట్' అన్నట్టైతే అందరిలాగా తానూ సర్కిల్ ఐవుందునే? ' అని —

---

అమ్మమ్మ ఉవాచ :-

"మానాభిమానంబులు దేహానికేగాని ఆత్మకు కావురా. పిచ్చివాడా ! ప్రతి అవమానానికీ ఆత్మహత్య చేసుకుంటే మన పెద్ద పెద్ద జాతీయనాయకులంతా యీపాటికి ఒక్కొక్కరూ లక్షసార్లు చచ్చివుండాల్సింది."

# ఓ స వి మ ర్శ

<u>పు స్తకం</u>

పరిశయ ప్రణయ ప్రబంధం

కవి :- కవిరాజాధిరాజు వేదం విస్సన్నగారు.

ఈ ప్రబంధరాజం శ్రీ శ్రీ శ్రీ రాజబహద్దూర్ విగతమస్తిష్క మహారాజావారికి అంకితమీయబడింది. వారు నూతనంగా స్వీకరించిన దేశభక్తి మతానికి చిహ్నంగా యింతటి ఉద్గ్రంధాన్ని చేతికాగితంమీద పేజీకి ఒకేపంక్తిచొప్పున అచ్చొత్తించారు. ఖద్దరు గుడ్డతో బైండుచేయించారు.

ఆదినుండి అంత్యంవరకూ గండభేరుండ సమాసాలతో, కవిత్వం మంచి ఎండుకొబ్బరి పాకంలోనడిచింది.

పాఠకలోకానికిది తలగడదిండుగానూ, తలంటుపీటగానూ, దీపపు శెమ్మెగానూ వారి తెలివితేటలను బట్టి ఉపయోగించగలదు. యిలాంటి సర్వోపయోగి భాషతో నిమిత్తంలేకుండానే ప్రపంచమంతటా, గదిగదిలో తప్పక వుంచదగినది.

పాఠకుల సౌకర్యార్థం యీ గ్రంధానికి అనుబంధంగా సూర్యరాయాంధ్ర నిఘంటువులాంటిది ఒకటి చేర్చివుండవలసింది.

వలయువారు......

# ఎర్ర దయ్యాలు

కోటినాయుడికి కృతయుగంనాటిది ఓ కోటు వుంది. ముందుభాగాన చినుగుల్లేని రెండు జేబులున్నాయి. మోకాళ్ళదిగని రెండు ధోవతులున్నాయి, డిప్పలాంటి తలపాగా వుంది. వరసలవారీగ్గా, సప్త సంతానం వుంది. చప్పున కనికూర్చోనే సామర్థ్యంగల సాధ్వి యిల్లాలు వుంది. ఉబ్బసపు దగ్గుతో ఊరూ నాడూ కాచే వృద్ధమూర్తి తండ్రి వున్నాడు. అన్నిటి కంటె ముఖ్యం — అతని ఉద్యోగధర్మాని కుపకరించ గల పొన్నకాయలాంటి తలకాయ వుంది. ఐతే దానికి ఆలోచించే పనిమాత్రం లేదు. కోటినాయుడు బ్యాంకీలో గుమాస్తాగా ప్రవేశించటమూ, అతగాడి పొన్నకాయలో నించి ఆలోచనాశక్తి నిష్క్రమించటమూ, యించు మించు ఒకేసారి జరిగాయి. యిప్పుడు కోటినాయుడు శరీరమంతా ఆలోచనతో కాదు. అలవాటుతో జరిగిపోతుంది.

కోటినాయుడు రోజూ 10 గంటలకు ఆఫీసుకు వెళ్తాడు. అతను వెళ్ళడు. కాళ్లే అలవాటుకొద్దీ అలా వెళ్లి పోతాయి. శరీరం కుర్చీలో కూలబడుతుంది. నోరు కూడా కలు కూడేస్తుంది. వేళ్ళు బర బరా కొత్త రూపాయల నోట్లు తిప్పేస్తాయి. మానేజరు పెట్టే చీవాట్ల భారానికి

తల దానంతటదే, క్షణంపాటు వంగుతుంది. కాలం గడిచినకొద్దీ కళ్ళు గోడగడియారంవంక చూస్తాయ్. సాయంత్రం 6 గంటలకల్లా ఆ యాతనా శరీరం బండెడు రికార్డులు చంకబెట్టుకుని కొంపజేరుకుంటుంది. అదీ! కోటినాయ్డు వరఫ్ మెషిన్ దినచర్య.

ఐతే ఆరోజున కోటినాయ్డు వరప్ మెషిన్‌కి ఏదో ఉపద్రవం కలిగింది. 7 గంటలకు కాకుండా, ఆరున్నర గంటలకే కొంపకి చేరింది. భార్య యింట్లో సరుకుల్లేవని తిడితే ఎదురు తిట్టలేదు. కొంపలో 'గీ 'బా' లకు జడిసి షికారుకని దూరంగా పారిపోలేదు. ఏమిటో పుట్టి మునిగిపోయినట్టు అలవాటులేని ఆలోచనకి తెగబడ్డది.

బ్యాంకిలో చేరిన పదిహేనేళ్ళ తర్వాత తొలి సారిగా ఆరోజే అతని తలలో ఆశ్చర్యం కాస్త చోటు చేసుకున్నది. ఆ సాయంత్రంనుంచే అతని తల ఆలోచనల్తో ఉక్కిరి బిక్కిరైపోతోంది. సమాధానాలురాని సవాలక్ష సందేహాలతో సతమత మౌతోంది.

ఆవేళ సాయంత్రం 4 గంటలకు టేబులు మీదకు నోటీస్ బుక్ వచ్చింది. 5 గం. కల్లా గుమస్తాలంతా మీటింగుకు రావాలంట. 'ఆఁ? అదివరకల్లా ఆఫీస్ టైము అయినాకకూడా దేకించుకునే మానేజరు ఈనాడు అరగంటముందే పని వదలమంటున్నాడే?'

మీటింగు చూచాక కోటినాయుడికి మరింత ఆశ్చర్యమయింది. అదివరకెప్పుడూ తాను మానేజరు దగ్గరకు వెళ్లినా, మానేజరు తనదగ్గరకు వచ్చినా తానే నిలబడేవాడు. యీ పూట తనకంటే దిగువమెట్టు గుమాస్తాలు సైతం కూర్చొని వుండగా మానేజరు చేతులు గట్టుకొని నిలబడి మాట్లాడుతున్నాడు.

ఎ|్రదయ్యం |పపంచాన్ని పట్టి పీడించబోతుందట. అది ముఖ్యంగా కష్టపడి సంపాదించుకొనే వాళ్లని ముందు పడుతుందట.

'తనను పట్టటానికీ వీలుందన్నమాట-' నాయ్డుకి భయంవేసింది.

ఆ భూతం పట్టినవాళ్లకు సంతృప్తివుండదట.

తనభార్య ఎప్పుడూ " ముష్టిజీతం. మూనాళ్ళకే చాలద'నటం జ్ఞాపకంవచ్చి హడలిపోయాడు.

అది పట్టినవాళ్లు 'ఊరేగింపులు-సారేగింపులు' అని సిగ్గువిడిచి బజార్న పడతారట.

" ఛీ! అసహ్యం " అనుకున్నాడు.

పరువు విడిచి 'అవికావాలి - ఇవికావాలి' అని కేకవేస్తారట.

" పరువు తక్కువ - అవమానం. " అనుకున్నాడు.

తొంభైఎనిమిది

యీ భూతానికి ఎక్కువగా చిరుగుగుడ్డలు మురికి గుడ్డలూ అభిమాన స్థలాలట.

కోటినాయ్డు అప్రయత్నంగా గడ్డం తవిడి చూచుకున్నాడు. చొక్కా చినుగులు చూసుకుంటేగాని అనుమానం తీరేటట్టులేదు. కోటి గుమస్తాలకు కూడ కన బడని ఆ చినుగులు ఎర్రదయ్యానికి కనబడతాయా? ఏమో! గప్ చిప్‌గా వెతుకుతున్నాడు. యింకా అను మానం తీరక ఆ డిప్పతలగుడ్డకూడా తీసి చూచాడు.

యీ భూతం ప్లేగులా వ్యాపిస్తుందట. యిది పట్టినవాళ్లు పని చెయ్యరట. సమ్మెలు చేస్తారట. సమ్మె లలో ఉన్న పనికాస్తా ఫ్రూడుతుందట. యిలా ఎన్నో చెప్పాడు. యీ భూతాన్ని మొదట్లోనె వదిలించుకోవా లట. ముదిరిం తర్వాత తుపాకి కాల్పులకు కూడా లొంగదట. — యెవరికి వాళ్లే జాగ్రత్తపడమన్నాడు. తాము కూడ యెంతైనా ఖర్చుపెట్టి యీ భూతాన్ని వది లించటానికి తిప్పలుపడతామని ముగించాడు.

ఏ గుమస్తాకైనా జబ్బుచేస్తేనే శెలవు యివ్వని యీ మానేజరు యెంత డబ్బయినా యె‌ ఖర్చు పెడ తాడూ?

"కలకత్తాలో బ్యాంకు గుమస్తాలు సమ్మె చేశారు. అందుకూ యీ హడావుడి" అన్నాడు నాగే శ్వరరావు.

యిది ప్లేగులా అంటుకొంటుందా? అంతా కొంపా గోడూ వదిలి వూరు బయటికి చేరాల్సిందే!'''
వెంటబడ్డాడు నాయుడు.

''యీ భూతం పట్టితే బాగానే వుందుము. మనకేమయ్యా? యీ భూతాన్ని నాశనం చేయాలంటున్నారే! వాళ్లు మాత్రం, యీ వూరేకాదు. దేశమే వదిలిపెట్టక తప్పదు.''

కోటినాయ్డుకేమీ అర్థంకాలేదు. కాళ్లు దారి తీసిన విధంగా కొంపకు చేరి, నవారు మంచంమీద కూలబడ్డాడు. అదికాస్తా 'పుట పుటా' రావాల్తో తెగి వూరుకుంది. సగానికిపైగా అందులో దిగబడిపోయాడు.

భార్య ''తెచ్చేదీ పెట్టేదీ లేకపోయినా అలా తెగ్గొట్టి నాశంచేస్తావేం?'' అంది సంజ అంట్లు గల గలకి తోడుగా —

కోటినాయ్డు తుళ్లిపడ్డాడు.

''ఆ భార్యకు అంతకుముందే ఆ భూతం ఆవరించింది. ప్లేగులాగ తన నెలాగు లంకించుకుంటుంది; యిక తర్వాత చినుగు గుడ్డలూ, మురికి గడ్డమూ, వుండనే వున్నాయి; పట్టుకు వేళ్లాడటానికి'' — అనుకున్నాడు.

'ఊరేగింపులూ సారేగింపులు' అని తాను కూడ బజార్నపడాలి కాబోలు. నవ్వుకున్నాడు. 'ఛీ, ఛీ' అంటూ ఆ దృశ్యాన్ని తలచుకొని కృంగిపోయాడు.

అలానే ఆలోచిస్తూ ఎప్పుడు తిండితిన్నదీ మరచిపోయాడు. రోజూలాగ రికార్డు ముందువేసుకుంటే పనిసాగలేదు.

'లాభంలేదు. ఎఱ్ఱదయ్యం అంటుకొంది. యిక తాను పనిచెయ్యడు. సమ్మెచేస్తాడు. ఉద్యోగం కాస్తా ఊడుతుంది. యీ గంపెడు సంసారమూ బజారు కెక్కు తుంది. ఎలాగం?'

'తన భార్యనించే తనకీ భూతం ఆవరించింది. ముందు తన భార్యకే భూతాన్ని వదిలించాలి. ఎలాగా?'

భార్య దగ్గరికి వెళ్లాడు. నిద్రలేపుతున్నాడు. ఆమె విసుక్కుంటోంది. 'చాల్లే, యీ వున్న సంతానం చాలకనా! తెచ్చేదీ పెట్టేది లేకపోయినా —'

కోటినాథ్యు తిరిగి వులిక్కిపడ్డాడు. ఆ భూతమే అలా ఆవిడచేత పలికిస్తోంది. ఆ 'జీతం చాలదు' అన్నదే ప్రమాదకరమైన లక్షణం. భార్యను తిరిగీ తిట్టాడు. లోలోపలే.

''చూచావూ. ఇప్పుడు ఎఱ్ఱదయ్యం దేశంలో తెగతిరుగుతోంది. అది ప్లేగులా చరచరా పాకుతోంది. అది పట్టినవాళ్లు ఎప్పుడూ 'డబ్బు చాలద'నే అంటుం టారు. చూచావూ? ఆమాట ఎప్పుడూ అనేది నీవే. నీకే ఆ భూతం పట్టింది.''

'నీకేంపట్టలా?'

'నాకు పట్టేటట్టే వుంది ?'

'చాల్లే పడుకో - ఉన్న మాటంటే భూతమూ ఏమిటి ? డబ్బు చాల్తోందా ?'

'ఆమాటే - అదే... ఆ భూతం చినిగిన గుడ్డలు, మాసిన గడ్డాలు పట్టుకొని వేళ్ళాడుతుంది-'

'నాకుగడ్డం లేదు; నీపుణ్యామాంటూ గుడ్డలూ లేవు. కాని పోయిపడుకో - యీభాగ్యానికేనా ? వరహా లాంటి నిద్ర చెడగొట్టావు !.

"ఎర్రిభూతం పట్టినవాళ్లు పనిచెయ్యరు. జీతం ఎక్కువ కావాలని సమ్మె చేస్తారు."

'అది పట్టినా బాగేపడిపోదుం .. జీతంఅన్నా పెరుగుతుందేమో___'

'హరి ! హరీ !' కోటినాయుకి అయోమయ మయింది. 'ఆ భూతం పట్టినా బాగుపడేపోదుం- జీతం అన్నా పెరుగుతుందేమో ?' భార్యఅన్న దే తిరిగీఅన్నాడు.

నిజానికి తిట్లుతినకుండా యింటివాడికి అద్దె యిచ్చిన నెలంటూ లేదు. చాకలివాడు గుడ్డలు మురగ బెట్టకుండా తెచ్చిన వారంలేదు, నెలలేదు. ఫైనులేకుండా పిల్లవాడి కెప్పుడూ జీతంకట్టలేదు. అప్పుచేయకుండా గడ చిన నెల అంతకన్నా లేదు. జీతం యీలాగేవుంటే; ధరలూ అప్పులూ అలా పెరుగుతూనేవుంటే, యిప్పటి

దాకా పరువుమాత్రమే తీస్తున్న అప్పులవాళ్లు ఎప్పుడో బజార్లో నిలబెట్టి ప్రాణమే తీస్తారు.

ఇలా ఆలోచిస్తుంటే దడ ఎక్కువయింది. సాయంత్రం మానేజరన్నాడు 'యీ భూతంపట్టిన వాడికి సంతృప్తి వుండదు' అని - తనక్కూడ భూతంపట్టిందా ఏమిటీ?

'యీ భూతం పట్టినవాడు పనిజెయ్యడు-సమ్మెచేస్తాడు.'

నిజమే. తాను రాత్రి రికార్డు ముందువేసు కూర్చున్నాడేగాని ఏమీ చెయ్యలేదు- అహా! వుద్యోగం కాస్తా వూడుతుంది. సంసారపుగోలా, అప్పులవాళ్ళ మొహాలూ చూడలేక తాను ఉరిబోసుకు చస్తాడు.

'యీ భూతం- పట్టినట్టు తెలుసుకోలేనంత సూక్ష్మంగాపడుతుంది' అన్నాడు మానేజరు.

'అదికాస్తా జరిగేపోయింది. నన్ను భూతం పట్టనేపట్టింది. నేనే తెలుసుకోలేకపోతున్నాను' అనుకున్నాడు.

కన్నుమూస్తే కలలు - ఒకటే కలలు

తాను బజార్లో నిలబడ్డాడట. పాకీవాళ్లూ, ఫ్యాక్టరీవాళ్లు అంతా ఊరేగింపుచేసుకుంటూ పోతున్నారంటం 'జీతాలు పెంచాలి' అని కేకలుబెడ్తున్నారట.

విద్యార్థులుకూడ వున్నారట. 'విద్యార్థులకు జీతాలు తగ్గించాలి' అని కేకలుపెట్టేవాడు తనకొడుకేనట. విద్యార్థుల కెవరికి చినుగుగుడ్డలు లేవట. తన కొడుక్కు మాత్రం మాసేందుకు గడ్డంలేదుగాని, చినుగుగుడ్డలున్నాయట. తన వూరికాపు అంకమ్మ అందులో వున్నాడట. ఆడవాళ్లుకూడ వున్నారట. సప్తసంతానంతో తన భార్యకూడ వుందట. అందరికి చినుగుగుడ్డలున్నాయట. ఆడవాళ్ళక్కూడ మాసిన గడ్డాలున్నాయట. భార్య తనని రమ్మంటోందట. తాను ఎంత మొడంగావుంటే అంత మంచిదని వెనక్కు వెనక్కు పారిపోతున్నాడట. ఎలాగో మరి తాను అందులోనే వున్నాడట...

"దయ్యం- ఎర్ర దయ్యం"- అంటూ త్రుళ్లిపడి లేచాడు.

'ఏమిటా కేకలు' అని ఓ కేకపెట్టి మళ్లీ నిద్రలో మునిగింది భార్య.

"పిల్లవాళ్లకు బళ్లో జీతాలు పెరిగాయి. వస్తువులకు బజార్లో ధరలు పెరిగాయి. చెల్లించాల్సిన పన్నులు పెరిగాయి. బ్యాంకులో రికార్డులు పెరిగాయి. ఆఫీసులో పని పెరిగింది. సంతానం సరేసరి. ఇంటివాడి అద్దె పెరిగింది. ఋుచ్చినవాడి దగ్గరల్లా అప్పులు పెరిగాయి." అనుకుంటూ కన్ను మూశాడు. కలలు-ఒకటే

కలలు-పాత భూతాలకీ, కలలకీ తాను ఆంజనేయదండకం చదివేవాడు. మరి యీ ఎర్రి భూతానికేం చదువుకోవాలో-

'యీ వ్యాధి ముదిరిందా? తుపాకి కాల్పులకి కూడా లొంగదు.' అన్నాడు మానేజరు.

'తన వ్యాధి ముదిరిపోయిందో? కాక-తుపాకి కాల్పులకన్నా కుదిరే దశలో వుందో?'

పాపం కోటినాద్దు కలల్ని కౌగలించుకుని ఆరాత్రింతా అల్లాగే పండుకున్నాడు.



అమెరికా పెట్టే కేకలు మూడో యుద్ధానికో, నాలుగో యుద్ధానికో కోటినాద్దుకు తెలియదు. అమెరికా అప్పులకి ముట్టెత్తే భారతదేశం తటస్థంగా వుంటుందో చాదస్తంగా వుంటుందో తెలియదు. దేశీయ సంపద పెరగాలంటే పెట్టుబడిదార్లకు లాభాలు పెంచాలో? కార్మికులకు జీతాలు తగ్గించాలో? తెలియదు. అసలు అమెరికా కేకలు పెడుతోందనిగాని భారతదేశం ముట్టెత్తుతోందనిగాని ఎరగడు. చివరకు ప్రజలంటే పెట్టుబడిదార్లో సామాన్య జనమో యెరుగడు. తాను 'ప్రజ'లోవాడో 'బ్యాంకి'లోవాడో ఎరగడు.

ఐతే యిప్పుడిప్పుడే కోటినాద్దు తల బ్యాంకి రికార్డుల్లోనించి బయటి ప్రపంచంలో జొరబడుతోంది.

పూర్వమైతే కాంగ్రెసువాళ్లుగనక జైళ్లు వదిత్తే యిళ్ళకు, యిళ్లు వదిత్తే జైళ్లకు వెళ్లినట్లు బ్యాంకికీ, యింటికి మధ్య ఆసులో దారంలా తిరిగేవాడు. యిప్పుడల్లాకాదే! ఎర్రిదయ్యం ఎవర్నెవర్ని ఆవరించిందో, ఎలా ఆవరించిందో పరిశీలిస్తున్నాడు. ఆ రోజు మానేజరు చెప్పిన కొలత బద్ధతో ప్రతివాణ్ణి కొలుస్తున్నాడు. మాటలో, చూపులో, మాసిన గడ్డంలో ఎర్రిదయ్యం అంతుకనుక్కుంటున్నాడు.

ఓ గొడ్లకాడ బుడ్డాడు గేదెమీద స్వారి దోల్తూ 'కాంగిరేసొచ్చిందిరా — సోదరా — కాటకం హెచ్చిందిరా' అని పాడటం విన్నాడు. ఇక ఎర్రిదయ్యం మహిమేనని తేల్చుకున్నాడు.

యింకోసారి ఫ్యాక్టరీ కూలీలంతాచేరి 'యీ ధరల్లో యీయనిచ్చే చచ్చు రూపాయి ఏమూలకి? ఏదో ఒకటి తేల్చుకోవా' లనుకోవటం విన్నాడు.

యింకోచోట రైతులు ''యిలా యింకా ఏడాది జరిగిందో - చచ్చామే. 'అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి' ఐతే ఎంతకాలం యీడుస్తాం. చేసుకోడానికి చేనేనా లేకపోతుంటే'' అనుకొంటున్నారు.

'అబ తేరెసివా అరటికాయమీద పన్నురా— అదేమంటే ముడ్డిప్రాసమీద తన్నురా—' అని రాగాల్తీస్తున్నాడు. ఓ గుర్రబ్బండీవాడు—

మరోసారి గుమస్తాలంతా 'యిక నెట్టవే మోయ్ — పన్నుమీద పన్ను — అన్నిటిమీద తెగ పన్నులామె, ధరలు చుక్కలుచ్చూస్తుండె' అనుకోవటం వినిపించింది.

మధ్యరకం జనాభా 'ఆ! కాంగ్రెస్ కాంగ్రెస్ అనుకుంటే వచ్చింది. దాని మజా చూపించింది. తిరిగి పోయే రోజు కూడా దాపులోకి వచ్చింది. యిక కమ్యూ నిజమన్నా వస్తే' అనుకొంటున్నారు.

ప్రతివాళ్లు ఎర్రిభూతం పట్టినట్లే మాట్లాడు తున్నారు. మానేజరు కొలతబద్దతో చూస్తే అంతా ఎర్రి భూతానికి గురయ్యేవాళ్లే. మరి తనగతేంగానూ - యింత జనాభా మధ్యలో ఆభూతాన్ని దరిజేరనీయకుండా తానొక్కడే ఏం చేయగలడూ.

కోటినాయుడుకి పిచ్చెత్తినట్లౌతోంది. ఆఫీసుపని సరిగా సాగటంలేదు. మానేజరు అనుమానపు చూపులు చూస్తున్నాడు. సరకుల ధరలూ జీతమూ పోల్చి చూస్తోంటే సంసారంసాగే అవకాశాలు రోజురోజుకు సన్న గిల్లుతున్నట్లుంది. అలా అనుకుంటే మానేజరు పెట్టిన ఎర్రిభూతం భయం నిలువునా ఎదుట నిలబడుతోంది.

'ఆ భూతం పట్టినవాడు పనిచేయడు-సమ్మె చేస్తాడు.'

ఉద్యోగం వూడుతుంది. సంసారమంతా ఆక లితో చస్తుంది.

క్షణక్షణానా ఎర్రభూతం పెరిగి భూగోళా న్నంతా చాపచుట్టలా చుట్టుకొస్తున్నట్టుగా వుంది. కాని దాన్ని అరికట్టడమెలాగో మరి ?

ఎంతో గొప్పవాడైన మేనేజరుకే 'ఆభూ తాన్ని, భయాన్ని పోగొట్టుకోడానికి ఆంజనేయ దండకం చదవాలా? ఆగ్నేయ దండకం చదవాలా? అంటే తెలి యలా. పైగా గుడ్లుతిప్పాడు. ఎగతాళనుకొని-నాగేశ్వర రావు నడిగితే 'గాంధేయ దండకం చదువుకో' మన్నాడ వెక్కిరింతగా.

♦ ♦ ♦

కోటినాయుడు జన్మకల్లా యీరోజు శివరాత్రి. తొలిసారిగా అడగాపెట్టాకుండా ఓపూట శెలవువచ్చి పడ్డది. తొలిసారిగా రేడియో వినబోతున్నాడు. స్థలమా? 'సత్య నిలయ' పార్కు. విషయమా ? తనని పరిపరి విధా లుగా వేధిస్తోన్న 'ఎర్రభూతం'. బోధకుడా ? ఘనత వహించిన ప్రజాతంత్ర ప్రభుత్వంలో మహామాంత్రిక శ్రీ భూతాత్మగారు.

యీ సమాచారాన్నంతా యిముడ్చుకు వచ్చిన ఆ నోట్‌బుక్‌ను ఎత్తి ముద్దాడాలనుకున్నాడు. 'ఎంతని నేవర్ణింతును నోట్‌బుక్' అని ముఖారిలో కృతి

పాడాలనుకున్నాడు. కాని తనకంటే దిగువమెట్టులోగల బంటోరిత్ ఎదురుగా వుండటంతో అతని ఆనంద ప్రకటనకి అంతరాయం గలిగింది. ఆదుర్దాగా అందరిదగ్గరకూ వెళ్లాడు. నీవా ? నీవా ? అంటూ-

నోటీసే వచ్చినతరువాత పోకుండా వుండట మేలాగ ? నోటీస్ పంపడంలోగల మానేజరు శ్రద్ధ ఎవరు రాలేదో చూడటంలో వుండదా ?

అలా ఆర్చుకుని తీర్చుకొని అంతా బయలుదేరి వెళ్లేసరికి 'సత్యానిలయ' పార్కు సాంతంగా నిండి పోయింది.

ఒక రేడియో అభిమాని అంటున్నాడు 'అబ్బా ! నేను చచ్చేలోపల యింతజనం యింకెన్నడూ రారు.' అని-

యింత జనానికీ కారణం ప్రభుత్వ ప్రచార మహత్తేనట. ప్రభుభక్తి పరాయణులైన గొప్ప గొప్ప వాళ్ల శ్రద్ధాసక్తులేనట. ఫ్యాక్టరీ యజమానులంతా కూలీల్ని లారీల్లో తీసుకొచ్చి మరీ పార్కుకు వప్పగించి పోయారు. మున్సిపాలిటీవాళ్లు పనివాళ్లకు హాజరు పార్కులోనే వేస్తామన్నారట. పల్లెటూళ్లలో మునసబు కరణాలు తగుశ్రద్ధ తీసుకొని శెట్టివాళ్లనీ, హోంగార్డుల్నీ యిచ్చి మరీ పంపారు. ఎలక్షన్లలో అనుభవాన్నంతా అమోఘంగా [illegible] చేశాక, వచ్చినవాళ్లే వళ్లూం వెళ్లి

పోకుండా చుట్టూ పోలీసుల్నీ, హోంగార్డుల్నీ, కావలా పెట్టేశారు.

జనం యిసుకవేసినా రాలటంలేదు. సూది పడ్డా వినిపించేటంత నిశ్శబ్దంగా వుంది. అప్పటికే ఐదునిమిషాలు ఆలశ్యమవటంతో ఎనౌన్సరుకూడా లేకుండానే మహామంత్రులు ఉపన్యాసానికి ఉపక్రమించారు.

“ఓ రేడియో శ్రోతలారా! మీకందరికీ శ్రీ వీర హనుమంతుని ఆన-భేతాళమూర్తి ఆన-నాగురువు పాన మాన-అభివందనాలు. దేశకాల పరిస్థితుల్నిబట్టీ కామన్ వెల్తు సూత్రాలకు అనుగుణ్యంగానూ సరే-!”

“ఎర్రదయ్యం చానా గడుగ్గాయి. మొండిది. యిది వాయువేగ మనోవేగాలకంటే జోరుగా ప్రపంచాన్ని అల్లుకుపోతుంది!”

కోటినాయ్డు గుండె గుభిల్లుమంది.

“యిది ప్రవేశించిన వెంటనే నరనరానా అల్లుకుపోతుంది. ఆ తర్వాత తుపాకులకుకూడ లొంగదని రుజువైపోయింది అదివరకే- అందుకనే అమెరికావాళ్లు ఆటంబాంబునల్లా అట్టేపెట్టుకొని మార్షల్ ప్రణాళికని ప్రయోగిస్తున్నారు.”

కోటినాయుడు నిరాశతో గడ్డకట్టుకు పోయాడు.

రేడియో చెప్పుకుపోతోంది-“యిది ముఖ్యంగా బక్క-చిక్కినవాళ్ళలో రక్తంలేని బలహీనుల్లో, స్వార

త్వరగా చొచ్చుకుపోతుంది. వాళ్ళలో యీ భూతాన్ని ఎదిరించగల దార్ఢ్యత వుండదు."

పార్కులో నిండిన జనంఅంతా అందరి మొగాలు చూస్తున్నారు. ఎవడికివాడికే అనుమానంవేసింది.

—"యిది బాగాతిని త్రేఫుతూవుండే వాళ్ళ చాయలకూడా రాదు. వాళ్ళ ఉదరాల్ని చూసే మైలు దూరాన్నుంచే వెనక్కుతిరుగుతుంది. ప్రపంచమంతటిలోను అంతే. ఎర్రభూతాల్ని అలా పాడలగొట్టగల శక్తిమంతులైన మన బొజ్జన్నలకు మీ అందరితరఫున నా ధన్య వాదాలు."

పార్కులో బెంచీలమీదతప్ప కూర్చోలేని నలుగురూ చప్పట్లు కొట్టారు. మగవాళ్లంతా ఆ నలుగురు శక్తిమంతుల్ని చూస్తున్నారు. ఈర్ష్య పడుతున్నారు. కోటినాయుడు ఏమితోచక వాళ్లనీ వీళ్లనీకూడ చూస్తు న్నాడు.

"ఈ భూతం ఏకాస్త చోటుదొరికినాసరే, ఆఖరికి తలమాసిన రకమైనాసరే ప్రవేశించి తీరుతుంది."

అక్కడ అంతా తల మాయటమేం? ఒళ్ళంతా మాసిన రకం. ఎగా దిగా చూచుకున్నారు. పోలీసులు మాత్రం ఒకళ్లకు తెలియకుండా ఒకళ్లు టోపీలు తీసి తలలు తడివి చూచుకున్నారు. తలమాసిన రకంవాళ్ళే.

పోలీసులు జరిమానాలకు జడిసి బయటకు కనపడేదేమీ మాయనీయరు, వాళ్ళకుండే మురికంతా తలల్లోనే.

'ఎర్రిదయ్యం చాలా ప్రమాదమయింది.' చెప్పింది. రేడియో —

''ఏమిటా ప్రమాదం!'' అడిగాడు నాగేశ్వర రావు.

"ఆగు! అదే తేల్తుంది," అన్నాడు కోటినాయ్డు.

''యీ భూతపు రోగ చిహ్నలు వినండి. 'ఆకలి–ఆకలి' అని అరుస్తుంటారు. ధరలు పెరిగిపోయాయి. అని కేకలు పెడతారు, 'పన్నులు తగ్గించాలి' 'జీతా'లు పెంచాలి' అంటూ బజార్న పడతారు'' చెప్పింది రేడియో.

"ఐతే మనమే'' అనుకున్నారు జనం.

''నేను ఎర్రిభూతాన్నా?'' అడిగాడు ప్రక్క వాడు.

''హుష్! విననీవయ్యా'' విసుక్కున్నాడు కోటినాయ్డు.

ఎవడికివాడు అదే అడుగుతున్నాడు. అందర్లోను యిప్పటికి అనుమాన భూతం ప్రవేశించింది.

''ఆ భూతం అలా ఎందుకు కేకలు పెడ్తోందో తెలుసా? అందర్నీ అలా తిండిలేని వాళ్లనిచేసి ఏకంగా పీక్కుతినవచ్చనీ–అందుకనే మా ప్రభుత్వం ఉన్నవాళ్లకు

బాగా లాభాలుమేపి ఎర్రి దయ్యాన్ని ఎదిరించగల వాళ్లని తయారుచేస్తున్నాం. ఈ ఎర్రిభూతం చాలాచాలా ప్రమాదం'' చెప్పింది రేడియో—

''ఏమిటారి ప్రిమాదం?'' అడిగాడు నాగేశ్వర రావు.

''ఓపికపట్టూ'' అన్నాడు కోటినాయ్డు.

''ఐతే మానమెటూ ఆ భూతానికి చిక్కేవాళ్లమేగా'' అడిగాడు ప్రిక్కవాడు.

''హుశ్ ! పినసీవయ్యా బాబూ'' విసుక్కున్నాడు కోటినాయ్డు.

''యీా భూతం రకరకాల కేకలు పెడ్తుంది. జనాన్నిబట్టి కేకలు మారుస్తుంది. యీా భూతం చాల మొండిదని యిందాకే చెప్పాను. యిది తన కోరికలు నెరవేరాలంటూా హఠమేసుకు కూర్చుంటుంది. అదే సమ్మె. ఇది 'జీతాలు పెరగాలి' అన్నదంటే, ఏమైనా సరే! పెరిగేదాక ఆ హఠం వదలదు.'

కోటినాయ్డు అప్రియత్నంగా 'ఆఁ !? ఊ!' అన్నాడు. ఐతే యీా దయ్యం మన దైవం అన్నాడు ప్రిక్కవాడు.

''కామాలు'' అన్నాడు కోటినాయ్డు.

"ఎర్రభూతం మహామహా ప్రమాదం" చెప్పింది రేడియో.

"ఏమిటా ప్రమాదం?" అడిగాడు నాగేశ్వర రావు.

"ఏమిటో?" అన్నాడు కోటినాయ్డు.

"అది ప్రమాదమైతే మనమూ ప్రమాదమే" అన్నాడు ప్రక్కవాడు.

"యీ కేకలు పెట్టేవాళ్ళంతా ఎర్రదయ్యాలే. యీ దయ్యాన్ని మీరంతా నాశనం చెయ్యండి. వీళ్లు ఒకళ్ళనొకళ్ళు 'కామ్రేడ్' అని పిలుచుకుంటారు. 'కామ్రేడ్' అన్నవాడినల్లా నాశనం చెయ్యండి."

కోటినాయ్డుకి నాగేశ్వరరావుని 'కామ్రేడ్' అని ఏడిపించాలని బుద్ధిపుట్టింది. అలా అనుకుంటూనే ఆప్యాయనంగా 'కామ్రేడ్' అన్నాడు. సిగ్గుపడి అందరి వంకా చూచాడు. అంతా అలాగే 'కామ్రేడ్' అని చూచుకుంటున్నారు.

"వీళ్ళ కేకలు ముఖ్యంగా గుర్తుంచుకోండి. పెట్టుబడిదారీ విధానం నశించాలి" అంటారు.

'అంటాం' అని గావు కేక పెట్టాడు ఓకూలి.

"భూమినంతా జాతిపరం చెయ్యాలి. 'దున్నే వాడికే భూమి' అంటారు."

"అనకేంచేస్తాం!" అన్నాడు ఓ రైతు.

"—'ధరలు, పన్నులు తరగాలి. జీతాలు పెరగాలి!' అంటారు" అన్నది రేడియో.

"అనకపోతే చస్తాం" అన్నాడు కోటినాయ్డు ప్రక్కగుమస్తా.

పోలీసులు ఏదో అనబోయి సర్కిలునుజూచి పెదవులు నొక్కుకున్నారు.

"ఎర్రభూతం మహాప్రమాదం. మహామహా ప్రమాదం" చెప్పేసింది రేడియో.

"ఏమిటా ప్రమాదం" అడిగాడు నాగేశ్వర రావు.

"ఏమీలేదు" అన్నాడు కోటినాయ్డు.

"ఆ బెంచీలమీద వాళ్ళకు ప్రమాదం" అన్నాడు ప్రక్కవాడు.

"ట-ట-ట-" ఎర్రభూతం నశించుగాక— ట-ట-ట-? ఆగిపోయింది రేడియో."

జనంఅంతా కోలాహలంగా లేచారు.

'జీతాలు పెరగాలి' అన్నారు కూలీలు.

'అయితే ఎర్రభూతం వర్థిల్లాలి' అన్నాడు నాగేశ్వరరావు. ఎర్రభూతాలు విజృంభించాయి. ఒకచే

కేకలుపెడుతున్నాయి. బెంచీలమీద కూర్చున్న నలుగురి మీదా కోరచూపులు చూస్తున్నాయి.

'అదుగో ఎర్రభూతాలు, పట్టుకోండి' అన్నాడు మేనేజరు.

'ఊఁ!' అన్నాడు పోలీసు ఆఫీసరు.

'నీవురా!' అన్నిడో కూలివాడు.

ముందు కూలీలు, రైతులు, గుమస్తాలు, విద్యార్థులు అన్ని దయ్యాలు బజాగ్నపడ్డాయి. పట్నం హడలెత్తేటట్లు, మేడలు గింగుర్లెత్తేటట్లు కేకలు పెడుతున్నాయి.

ఉరిమిచూచాడు పోలీసు ఆఫీసరు.

పోలీసులు మాట్లాడకుండా మనస్సులు జనంలో వదిలివేసి దిట్టంగా అక్టైషన్‌లో నుంచున్నారు.

హోంగార్డులు ముందు కో అడుగు వెయ్యబోయి వెనక్కు ఏడడుగులు వేశారు.

'పోలీసుల సమ్మె' అన్నారు షాహుకార్లు.

పోలీసుల చేతగానితనానికి తిట్టుకుంటూ సర్కిల్‌గారి టెలిఫోను మిలటరీకోసం ప్రార్థనలు చేస్తోంది.

మరచిపోయాను. ఇంతకూ మన కోటినాయుడు ఏమైనట్టు? ఆ మహాజన సముద్రంలో అతనూ ఓనీటిబొట్టు.

వీరి
ఇతర రచనలు

# మృత్యుంజయులు

[ నవల ]



# సూక్ష్మంలో మోక్షం

[ కథానికలు ]

ఇందులో ఉన్న కథలన్నీ ఆణిముత్యాలు – పాఠకుడి మనస్సుకొక క్రొత్తవెలుగు ప్రసాదిస్తాయ్. "సామాజిక దుష్ప్రభావాలమీద అధిక్షేపక కథారచన సాగించడంలో శ్రీ శివరామకృష్ణ గడుసరి" అన్నాడు 'అవసరాల'. ఔనో? కాదో? అనుమానం దేనికి? ' సంశయాత్మా వినశ్యతి ' కదూ? మీరూ చదివి చూడండి! స్వీయాను భూతి పొందండి!

